అట్టలోపలి వైపున అచ్చు వేసిన శిల్ప చిత్రంలో కనబడేది శుద్ధోదన మహారాజు. గౌతమబుద్ధుని తల్లియైన మహారాణి మాయాదేవికన్న స్వప్నం గురించి జ్యోతిష్కులు వ్యాఖ్య చేస్తూ ఉండిన దృశ్యం. వారికి దిగువ వారి వ్యాఖ్యను వ్రాసుకొంటున్న లేఖకుడు కనిపిస్తాడు. భారతదేశంలో లేఖన కళ చిత్రశిల్పంలో నిబద్ధమై లభించే దృష్టాంతాలలో ఇదే ప్రాచీనతమమైనది

— నాగార్జునకొండ క్రీ. శ. 2వ. శతాబ్దం.

— జాతీయ పురావస్తుశాల, న్యూఢిల్లీవారి సౌజన్యం.

భారతీయ సాహిత్య నిర్మాతలు

# వేమన

మూలం :

వి. ఆర్. నార్ల

అనువాదం :

జి. లలిత



సాహిత్య అకాదెమి

*Vemana* -- Telugu translation by G. Lalitha of V. R. Narla's monograph in English, Sahitya Akademi, New Delhi (1989) Rs.5


First Published : 1989.

సాహిత్య అకాదెమి

ప్రధాన కార్యాలయం :
రవీంద్ర భవన్, న్యూఢిల్లీ - 110 001

ప్రాంతీయ కార్యాలయాలు :
29, ఎల్డామ్స్ రోడ్, తేనాంపేట, మద్రాసు - 600 018
బ్లాక్ V - బి, రవీంద్ర స్టేడియమ్, కలకత్తా - 700 029
172, ముంబయ్ మరాఠి గ్రంథ సంగ్రహాలయ మార్గ్, దాదర్,
బొంబాయి - 400 014.

రూ. 5

Sri Krishna Chitra Printers, Madras - 17

పండిత ప్రకాండుడు, ఉత్తమ రచయిత

మరియు

అపూర్వ స్నేహశీలి అయిన

శ్రీ జి. వెంకటసుబ్బయ్య

గారికి

# విషయసూచిక

# అనువాదాన్ని గూర్చి

నార్లవారు ఇంగ్లీషులో రచించిన వేమన ప్రతి ఇప్పటికి మూడు మారులు ముద్రితం. 1969 వ. సంవత్సరంలోని ప్రథమ ముద్రణమే ఈ అనువాదానికి ఆధారం. ప్రథమ ముద్రణకు, పునర్ముద్రణకు చిరుమార్పులుండడంచేత ఈ విషయాన్ని పేర్కొనవలసిన ఆవశ్యకత ఏర్పడింది.

నార్లవారు ఇంగ్లీషులో తాము ఉదాహరించిన వేమన పద్యాలకు ఆకరాల్ని చూపలేదు. పరిశోధక విద్యార్థులకు, జిజ్ఞాసువులకు అది అవసరం గనుక, అనువాదంలో ఆకరాలు చూపబడ్డాయి.

వేమన పద్యసంకలనాలు అనేకమున్నా, వేమన పద్యాల్ని సమకూర్చి తొట్టతొలుత అచ్చులో ఆవిష్కరించిన మహనీయుడు సి. పి. బ్రౌన్. కనుక ఈ పుస్తకంలో ఉద్ధరింపబడిన వేమన పద్యాలకు ఆకరాలు సాధ్యమైనంతవరకు 1839 వ. సంకలనుండి చూపబడ్డాయి. అందులో లేని వానిని మాత్రమే, వావిళ్ళ, అకాడమీ ప్రతుల నుండి, ఒకటి రెండు పద్యాలు "వేమన్న వేదం" నుండి గ్రహింపబడ్డాయి. సి. పి. బ్రౌన్ 1839 నాటి సంకలనంలోని పద్యాలలో సవరణలు తక్కువ, యథాతథంగ గ్రహింపబడ్డాయి. అవే పద్యాలు వావిళ్ళ ప్రతిలో సవరింపబడిన పాఠాలతో ఉన్నవని గమనించాలి.

## సంకేత వివరణ

1. వేమన పద్యాలు సి. పి. బ్రౌన్ 1839 నాటి సంకలనం .... బ్రౌన్ 1839, పుట సంఖ్య. పద్య సంఖ్య.
2. వేమన పద్యాలు వావిళ్ళ రామశాస్త్రులు అండ్ సన్స్ వారిచే ప్రకటితము.... వావిళ్ళ ప్రతి. పుట సంఖ్య.
3. Verses of Vemana. A P. Sahitya Akademi .... అకాడమీ ప్రతి, పద్యసంఖ్య.
4. వేమన్న వేదం : ఆరుద్ర .... వే. వే.

# ముందు మాట

సాహిత్య అకాడమీ వారికి వేమన జీవిత సంగ్రహాన్ని వ్రాసివ్వడానికి ఒప్పు కున్న తరువాత యీ రచన కష్టసాధ్యమన్న విషయాన్ని గ్రహించాను. నా భీతి నిజమని నిరూపితమైంది. తెలుగులో వేమనకు సంబంధించిన పుస్తకాలు కొన్ని ఉన్నవన డం వాస్తవమే అయితే వాటిలో నమ్మరానికట్టుకథలనేకం. నిరాధారాలైన జనశ్రుతులెన్నో అవి యథార్థాలుగా చిత్రించాయి. ఇంగ్లీషులో కాని, ఇంకే ఇతర భాషలలో కాని వేమన జీవిత చరిత్రలేదు. వేమనను గూర్చి తెలుగులో ఒకే ఒక్క విమర్శనాత్మక జీవిత చరిత్ర వున్నది. అది కూడ సంతృప్తికరంగలేదు ఆ గ్రంథకర్త తన అభి ప్రాయాల కనుగుణమైన ఆధారాలను వెదకి ఆ పుస్తకంలో చొప్పించాడు. అందులో మరికొన్ని లోపాలు కూడా వున్నాయి. ఆ గ్రంథకర్త, పోయిన తరంలో సుప్రసిద్ధ రచయితయైన చిలకమర్తి లక్ష్మీనరసింహం వేమనను గూర్చి ఒక పుస్తకం రచించి నట్లు తన ఆకరాలలో పేర్కొన్నాడు. అదొక గ్రంథమనుకొని, దానిని సంపాదించ డానికి నానా అవస్థలు పడ్డాను. చివరకది పుస్తకం కాదని, చిలకమర్తివారు రచించింది ఒకానొక గాథల పుస్తకంలో చిన్న ప్రకరణం మాత్రమేనని తెలిసింది. మరొక విషయంలో కూడ ఆ గ్రంథకర్త సూచన నన్ను చాల ఇబ్బంది పెట్టింది. ఆ పుస్త కంలో ఒక సందర్భంలో మెక్లీన్ (Mr Maclean) అనే ఆయన చెప్పిన మాటల్ని పేర్కొన్నారు. ఈ రచయిత ప్రస్తావించిన మెక్లీన్ అనే వ్యక్తి ఎవరో కారు. వేమనను గూర్చి 1866. వ. సంవత్సరంలో ఒక వ్యాసాన్ని ప్రచురించిన మేజర్ ఆర్. యం. మ్యాక్‌డొనాల్డ్‌గారే (R. M. Macdonald) అని తెలుసుకోడానికి నాకు చాల నెలలు పట్టింది.

చరిత్రకారుణ్ణి అని చెప్పుకున్న మరొక తెలుగు రచయిత కూడ పెడదారినే పట్టించాడు. కొన్ని నెలల క్రితం ఆయన ప్రచురించిన ఒక పుస్తకంలో సర్ విలియం జోన్స్ వేమనను "భారతదేశపుప్లేటో" (The Plato of India) అని ప్రశంసించినట్లు వ్రాశాడు. ఢిల్లీలోని లోక్‌సభ గ్రంథాలయంలో ఈ వాక్యం కోసం జోన్స్ రచనలనన్నింటిని ఒక వారం రోజులు వెదికాను. ఫలితం శూన్యం. జోన్స్ గ్రంథావళికి విషయసూచిక లేనందు వలన ఎంతో శ్రమపడి వెదక వలసి వచ్చింది.

ఆ తరువాత కలకత్తాలోని జాతీయ గ్రంథాలయాధికారులకు, ఏషియాటిక్ సొసైటీ వారికి ఈ విషయాన్ని గురించి వాకబు చేస్తూ వ్రాశాను. వెంటనే వారు వ్రాసిన ప్రత్యుత్తరాన్ని బట్టి సర్ విలియమ్స్ స్లైట్ అని పేర్కొన్నది వ్యాసుని గాని వేమనను కాదని తేలింది.

ఇలా వేమనకు సంబంధించిన పుస్తకాలు అంత ప్రామాణికాలు కావు. రాళ్ళ పల్లి అనంతకృష్ణశర్మగారి వేమన ఉపన్యాసాలు మాత్రం దీనికి అపవాదు. అయితే రాళ్ళపల్లివారి వ్యాసాలు ఇప్పటికి నలభై ఏళ్ళ క్రితం ప్రకటింపబడినవి. అటు తరువాత పేర్కొనదగిన పుస్తకాలేమీ రాలేదు. ఇంగ్లీషులో కొన్ని మంచి రచన లున్నాయి, కాని అవి అందరికీ అందుబాటులో లేవు. ఉదాహరణకి: వేమనను గూర్చిన సర్. సి. ఆర్. రెడ్డిగారి రేడియో ప్రసంగం టేపు రూపంలోనే దొరుకు తుంది, ఆకాశవాణి కేంద్రంలో ఉద్యోగం చేస్తున్న నా మిత్రుడు శ్రీ దాశరథి సహా యంతోనే ఆ ప్రసంగపు టేపు ప్రతిని సంపాదించగలిగాను.

వేమనను గూర్చిన విషయసేకరణ పూర్తిచేసిన తరువాత అనేక పరస్పర వ్యాఘాత విషయావృత కీకారణ్యంలా తోచింది. అందులో నుండి బయట పడట మన్నది మరీ దుష్కరమనిపించింది. వేమన జీవితానికి సంబంధించినంతవరకు నిశ్చ యంగా తెలిసింది, తెలుసుకోగలది ఏమీ లేదని ఒప్పుకోక తప్పదు. వేమనను గూర్చిన అనేకాంశాలు వివాదగ్రస్తమైనవి. ఆయన శతకంలో ఉపయోగించిన "విశ్వదాభిరామ వినురవేమ" అన్న మకుటార్థం కూడ వివాదాస్పదమే. "విశ్వానికి అభిరాముడవైన వేమా! విను" అన్న అర్థాన్ని సామాన్యంగా అందరూ అంగీకరిం చినా పండితుల్లో అనేకులు తమ అభిమతానికి అనుగుణంగ ఆ మకుటాన్ని విశ్లేషించి వివిధంగా వ్యాఖ్యానిస్తారు. నేను సాధ్యమైనంతవరకు నిష్పాక్షికంగ వాస్తవాన్ని చెప్ప డానికే ప్రయత్నించాను. ఈ రచన చేయడంలో నేనెంతవరకు సమదృష్టిని పాటించి సఫలీకృతుడనయ్యానో పాఠకులే నిర్ణయించాలి.

విషయసేకరణలో మిత్రులు శ్రీ దాశరథిగారి సాహాయ్యాన్ని ముందే పేర్కొ న్నాను. ఇంకెందరో మిత్రులు కూడ నాకు తోడ్పడ్డారు. మదరాసులో "వాణి" ఉప సంపాదకులు శ్రీ డి. ఆంజనేయులుగారికి, యు. యస్. ఐ. యస్. లోని శ్రీ బి. యస్. ఆర్. కృష్ణగారికి, ఫ్రీడం ప్రెస్ అధినేతలు శ్రీ బాలసుందరంగారికి, నూజివీడులో

శ్రీ యం. ఆర్. అప్పారావు యం. ఎల్. ఏ. గారికి, వేటపాలెంలోని సారస్వత నికేతన నిర్వాహకులు శ్రీ ఏ. శ్రీనివాసరావుగారికి. హైదరాబాదులోని ప్రొఫెసర్ నిడుదవోలు వేంకటరావుగారికి, ఘంటసాలలోని జి. వి. సుబ్బయ్య పండితులుగారికి నా ప్రత్యేక కృతజ్ఞతలు.

వేమనను గూర్చిన విలియం హోవార్డ్ క్యాంబెల్ (William Howard Campbell) వ్యాసప్రతిని సంపాదించి పెట్టడమే కాకుండ శ్రీ ఆంజనేయులుగారు నా వ్రాత ప్రతిలోని మొదటి నాలుగు ప్రకరణాలను చదివి, ఉపయుక్తమైన సూచనలనిచ్చారు. తిరుపతిలోని శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు, శ్రీ ఆచంట జానకిరాంగారు కూడ వ్రాతప్రతిని చదివి సముచిత సలహాలనిచ్చారు. నా మిత్రుడు, సహోద్యోగి ఆంధ్రజ్యోతి ఉపసంపాదకులు అయిన శ్రీనండూరి రామమోహనరావుగారు ఈ రచనలో నాకు అడుగడుగున తోడ్పడ్డారు ఆంధ్రజ్యోతి పత్రికా కార్యాలయంలోని శ్రీ యం. వి. సుబ్బారావుగారికి కూడ నేను కృతజ్ఞుణ్ణి. వీరందరికి నా హార్దికాభివందనాలు.

చివరిమాటగా వేమనకు నేనెంత ఋణపడివున్నానో చెప్పుకోవాలి. వేమన వలన ప్రభావితుడనైన నేను ఆయన పరిపూర్ణంగా రూపుదిద్దిన ఆటవెలది ఛందస్సులో ఇప్పటికి ఆరువందల పద్యాలను రచించాను. వేమన ఋణాన్ని ఈ పుస్తకరూపంతో లేశమాత్రం తీర్చగలుగుతున్నాను.

వి. ఆర్. నార్ల

## గిట్టడానికి పుట్టలేదు

### నీవు చావడానికే పుట్టలేదు - కీట్స్

ఏ ప్రమాణాలతో పరిశీలించినా వేమన మహాకవి అన్నది పరమ సత్యం. ప్రజాభిమానాన్ని, ప్రసిద్ధిని బట్టి చూచినపుడు ప్రాచీనాధునికాంధ్ర కవులందరిలో వేమనను మించిన మేటికవి లేడు. వేమనకున్న ప్రసిద్ధి ప్రచారాలలో సగం కూడ మధుర కవియైన పోతనకు లేవు. ప్రజల్లో పట్టంలేని ప్రభువు వేమన. అసంఖ్యాక ప్రజానీకంతో, ప్రజలభాషలో మాట్లాడిన ప్రజాకవి వేమన. కనుకనే సామాన్య ప్రజ తమ హృదయాలను వేమనకు అర్పించారు. అప్పుడప్పుడు వేమన వాక్పారుష్యాన్ని తట్టుకోలేకపోయినా, ఆతని చిత్తశుద్ధివారికి తెలుసు. కాబట్టి వేమనను అధికంగ అభిమానించారు. వేమనను కవిగా అభిమానించడమేగాక ఒక దార్శనికునిగ, వేదాంతిగ కూడ గౌరవించారు. ఒక నీతిని నొక్కి చెప్పడానికో, ఒక సత్యాన్ని విశదీకరించడానికో, లేదా ఒక విషయాన్ని బలపరచడానికో వేమన వాక్కుల్ని తరచూ ఉదాహరిస్తుంటారు. భారతీయ భాషా సాహిత్యాల అధ్యయనానికి తన జీవితాన్నంతా వెచ్చించిన విదేశీ విద్వాంసుడైన జి. ఎ. గ్రియర్సన్ వేమనను గూర్చి : "నేటి తెలుగు కవులందరిలో అత్యంత ప్రసిద్ధిని పొందిన కవి వేమన. వేమనకు ఆపాదింపబడని సామెతగాని, సూక్తిగాని ఉండడం చాల అరుదు" అని అభిప్రాయపడడంలో ఆశ్చర్యం లేదు.

వేమన కీర్తిప్రాభవాలు కేవలం ఆంధ్రదేశంలోని ప్రజాసామాన్యానికి మాత్రమే పరిమితం కాదు. ఇరుగు పొరుగు ప్రాంతాలకు కూడ అతని కీర్తి వ్యాపించింది. చాలకాలం క్రితమే వేమన పద్యాలు తమిళ కర్ణాటక భాషల్లోకి అనువదింపబడ్డాయి. ఇతర భాషల్లోకి అనువదింపబడిన తెలుగు కవితలలో వేమన కవిత ప్రథమం కాకపోవచ్చు. కాని బహుభాషలలోకి అనువదింపబడిన కవిత గల తెలుగు కవులలో వేమనను మించిన కవి లేడు.

అయినప్పటికి ఆంధ్ర పండిత లోకం వేమనను ఒక ప్రామాణిక కవిగ ఈ శతాబ్దపు తొలి పాదం వరకు గుర్తించలేదు. అంతవరకు ఏ ఆంధ్ర కవిగాని

పండితుడుగాని, వాఙ్మయచరిత్రకారుడుగాని వేమననుగూర్చి ప్రస్తావించలేదు. ఆంధ్ర వాఙ్మయ చరిత్రకారులలో ప్రథములైన గురజాడ శ్రీరామమూర్తి, కందుకూరి వీరేశలింగం తమ వాఙ్మయ చరిత్ర గ్రంథాలలో వేమనను పేర్కొనక పోవడమే సముచితమని భావించారు. శ్రీరామమూర్తి గ్రంథంకన్న వీరేశలింగంగారు 1897 వ సంవత్సరంలో ప్రచురించిన ఆంధ్ర కవుల చరిత్ర కొంత వరకు సమగ్రమైనది. అందులో వేమనకు స్థానం లేదు. ఆ గ్రంథానికి 1917. వ. సంవత్సరంలో వెలువడిన ద్వితీయ ముద్రణలో మొత్తం 220 మంది కవుల చరిత్రలున్నా వేమనకు మాత్రం ప్రయత్నపూర్వకంగనే స్థానం కల్పింపబడలేదు.

శ్రీ రామమూర్తి, వీరేశలింగాలకన్న పూర్వమే 1829 వ సంవత్సరంలో కావలి వేంకటరామస్వామి Biographical Sketches of the Deccan Poets అన్న పుస్తకాన్ని ప్రకటించాడు. తన పుస్తకాన్ని గూర్చి వేంకటరామస్వామి : "దక్షిణ భారతదేశంలో వివిధ ప్రాంతాలలో ఆయా కాలాలలో వర్ధిల్లిన ప్రాచీనార్వాచీన ప్రసిద్ధ కవుల జీవిత చరిత్రలు ప్రామాణికమైన ఆధారాలతో రచింపబడిన గ్రంథమిది" అని చాటాడు. ఆంధ్రుడైన ఒక రచయిత ఇంగ్లీషు భాషలో రచించిన యీ గ్రంథంలో ఆంధ్ర కవులపట్ల పక్షపాతం చూపడం సహజమే. ఈ గ్రంథంలో మొత్తంనూట ఎనిమిదిమంది చరిత్రలున్నవి. అందులో నలభై ఏడుగురు తెలుగు కవులు.

ఈ నలభై ఏడుగురిలో వేమన మాత్రం లేడు. వేమన భాష నిర్జీవమైనదై శైలి నారికేళపాకమై, భావాలు కాలదోషానికి పాల్పడి వున్నట్లయితే విస్మరించడంలో అర్థమున్నది. కాని వాస్తవం తద్భిన్నగ ఉన్నది. వేమన భాష స్వచ్ఛమైనది; వాడి గలది; శైలి సరళం, సాటిలేనిది; ఆయన ఉపమలు, పోలికలు సహజంగ, సరిక్రొత్తగ, గంభీరంగా, వియత్తలాన్నంతా వెలిగించే మెరుపు తీగల్లాగ ఉంటాయి. కొన్ని విషయాలను గూర్చి ఆయన వెలిబుచ్చిన అభిప్రాయాలు అతని కాలాన్నేకాక ఆధునిక కాలాన్ని కూడ అధిగమించి ఉన్నాయి. ఉత్తమ కవిత్వముండవలసినట్లే వేమన కవిత ప్రతిభాన్వితం; ఉటంకింపదగినది. జేమ్సు ప్రభువు కాలంలో అనువదింపబడిన బైబిలు, షేక్స్పియర్ రచించిన నాటకాలు ఇంగ్లీషు భాషను అపూర్వంగా సహస్రాధిక జాతీయాలతో, పదబంధాలతో సుసంపన్నం చేశాయి. అలాగే తెలుగు భాష కూడ వేమనకెంతో ఋణపడి ఉన్నది. తెలుగు భాషకొక క్రొత్త వాడిని, శక్తిని వేమన ప్రసాదించాడు. అటువంటప్పుడు ఆంధ్ర సాహిత్య వేత్త

లెందుకు ఇన్నితరాలుగ వేమనపట్ల వైముఖ్యాన్ని, ఉదాసీనతను, మౌనాన్ని పంతం పట్టినట్లు ప్రదర్శించారు? ఇదొక సూటి ప్రశ్న. సూటి ప్రశ్నకు సమాధానం కూడ సూటిగా, నిర్మోహమాటంగా ఉండాలి.

ఇందుకు మొదటి కారణం : వేదాలను, వేదాలు ప్రబోధించే కర్మకాండను, పురాణాలను, పురాణపురుషుల్ని, ధర్మశాస్త్రాలను, వాటిలోని అసమానమైన సామాజిక న్యాయాలను మొత్తం మీద దైవప్రేరితం, నిత్యసత్యవచో భరితం అనబడే మత గ్రంథాలన్నింటిని వేమన విమర్శించాడు. విగ్రహారాధనను పూర్తిగా ఖండించాడు. విగ్రహారాధనను సమర్థించే వారిపట్ల అసహనాన్ని వెల్లడించాడు. వేమన సాంఘిక విప్లవకారుడు. వర్ణవ్యవస్థవాదులతో నిరంతర పోరాటాన్ని కొనసాగించాడు. సమాజంలో సాటి మానవుని అంటరానివానిగా చూడడం ఘోరాపరాధమని, అంటరాని తనాన్ని వేమన తీవ్రంగ ప్రతిఘటించాడు. ఈ కారణాలవల్ల సనాతనుల దృష్టిలో వేమన ఒక పాషండుడు; నాస్తికుడు, మత భ్రష్టుడు. అట్టి వ్యక్తి నామాన్ని ఉచ్చరించడమే వారికి మహాపాతకం.

రెండవ కారణం : వేమన శైవుడయినప్పటికీ లింగధారణ, ఉపవాసాలు, జాగరణలు, యాత్రలు మొదలైన బాహ్యాచారాలను పరిహసించాడు. ఇట్టి బాహ్యాచారాల్ని వేమన ఎంతో తీవ్రంగ నిరసించడానికి లింగధారుల్ని కపటవేషధారులని బాహాటంగా తూలనాడడం ఒక నిదర్శనం. అందువల్ల శైవులైన గొప్ప రచయితలు వేమన మీద ఆగ్రహాన్ని ప్రదర్శించడం సహజమే. కాబట్టి శైవులు కూడ శైవేతరులతోపాటు వేమన పేరును విస్మరించారు.

మూడవ కారణం : వేమన శూద్రుడు. తెలుగు ఛందఃకర్తలలో ప్రామాణికుడైన అప్పకవి అంతటివాడే శూద్రకవుల కవిత పఠనయోగ్యం కాదని శాసించాడు. కులీనులైన కవులకు శూద్రకవులంటే అంతటి నిరసన వుండేది. కనుకనే 1829 వ సం॥ కాలేజి బోర్డు వారికోసం ప్రభుత్వోద్యోగియైన చార్లెస్ ఫిలిప్ బ్రౌన్ ప్రకటించిన వేమన పద్యాల (The Verses of Vemana, Moral, Religious and Satarical) 500 ప్రతుల్లో 450 అకస్మాత్తుగా అదృశ్యమయ్యాయి. సంపాదకుడిగ బ్రౌనుకు బహూకరించిన 50 ప్రతులు మాత్రం మిగిలాయి. అగ్రకులజులైన పండితులు కుట్రపన్ని కాలేజి లైబ్రరీలో ఒక చెత్తగదిలో ఆ 450

ప్రతుల్ని చెత్తకాగితాల కట్టలాగకట్టి పడవేశారు. ఈ విషయం బ్రౌనుకు పదేండ్ల తరువాత తెలిసింది.

వేమనపైగల ద్వేషభావం మిక్కిలి మూర్ఖంగ ఉండటంచేతనే 1866. వ సంవత్సరంలో Madras Journal of Literature and Science అన్న పత్రికలో మేజర్ ఆర్. ఎం. మ్యాక్ డొనాల్డ్ (R. M. Macdonald) వ్రాస్తూ కొంత వివరంగ వ్యాఖ్యానించాడు. ఆ వ్యాఖ్యానాన్ని ఇక్కడ పూర్తిగ ఉద్ధరించడం అవసరం :

"తెలుగు ప్రజలు వేమన కవిత్వాన్ని అధికంగ అభిమానిస్తారని" డా॥ పోప్ పేర్కొన్నారు. శూద్రులలోనే వేమనకు ఎక్కువ ప్రచారం ఉన్నదని నా అభిప్రాయం. శూద్రులలో కూడ వైదిక దృష్టిగల వాళ్ళు వేమనను నిరాకరిస్తారు. ప్రభుత్వపాఠశాలల్లో కొన్నింటిలో వేమన పద్యాలను పాఠ్యభాగాలుగ పెట్టినపుడు ఈ సంగతి స్పష్టంగ తెలియవచ్చింది. ఉపాధ్యాయులు, విద్యార్థులు కూడ వేమన పాఠ్యభాగాల విషయంలో ప్రభుత్వపు ఉత్తర్వులను కూడ ఉల్లంఘించడానికి బహువిధాల ప్రయత్నించారు. కొన్ని పాఠశాలల్లో కుంటిసాకులు చెప్పి వేమన పద్యాల్ని బోధించడానికి ఆలస్యం చేస్తూ వచ్చారు. మరి కొన్ని పాఠశాలల్లో ఉపాధ్యాయులే పద్యాలలో హిందూ మతాచారాలను విమర్శించే వాటిని వదలిపెట్టి పాఠం చెప్పారు. ముఖ్యంగా బ్రాహ్మణులు వేమనను నిరసించారు; దూషించారు. వేమన భాషగ్రామ్యమని, వేమన బోధనలు నీతిబాహ్యాలని ప్రకటించారు."

ముప్పయియేండ్ల తరువాత కూడ ఈ పరిస్థితి మారలేదు. క్రైస్తవ మత ప్రచారకుడైన విలియం హోవర్డ్ క్యాంబెల్ (William Howard Campbell) మద్రాసు క్రిస్టియన్ కాలేజి పత్రికలో 1898. వ. సంవత్సరంలో ఇలా వ్రాశాడు :

"బ్రాహ్మణులు వేమన ఉపదేశాల్ని ఎప్పుడూ ప్రతిఘటిస్తూ ఉంటారు. ఇప్పటికీ అతని కవితను పరిహసిస్తూ ఉన్నారు."

నాలుగవ కారణం : వేమన వాస్తవానికి విద్వాంసుడు కాడు. ముందే చెప్పినట్లు ప్రజావ్యవహారంలోని తెలుగు భాషలో ఆయన ఉద్దండుడు. తెలుగు పదాల అర్థాలలోని సూక్ష్మభేదాలను చక్కగా తెలిసినవాడు. పాతపదాలను వినూత్నమైన

అర్థాలతో ప్రయోగించగలడు. భాషాగర్భం నుండి పదరత్నాలను వెలికితీసి పదునైన పదబంధాలను,నూతనమైన నుడికారాలను, స్వచ్ఛమైన సామెతలను,చేవగల జాతీయాలను కల్పించే సహజ ప్రజ్ఞ వేమనకున్నది.వేమన శైలి సరళంగ, చమత్కారంగ ఉంటుంది. ఒక్కొక్కపుడు సూక్తుల్ని,సుభాషితాల్ని, నీతుల్ని, ధర్మసూత్రాల్ని, లోకోక్తుల్ని వరసగా గుప్పిస్తాడు. కేవలం పండితులకు, ఛాందసులకిది చాలదు. వారి దృష్టిలో అమరకోశం వంటి సంస్కృత నిఘంటువుల్ని ధారణ చేసిన వారు, ఛందో వ్యాకరణ నియమావళికి దాసులై కవిత్వం వ్రాసేవారు, సుదీర్ఘ సంస్కృత సమాసాల కూర్పులో నిపుణులైన వారు. అలంకారశాస్త్ర విధేయంగ కవిత చెప్పగలవారు, పాతవడ్డ ఉపమానోపమేయాలనే ఆదరించే వారు - ఒక్కమాటలో చెప్పాలంటే - సంప్రదాయ పాండిత్యాన్ని సాధించి, సంప్రదాయ వస్తువును స్వీకరించి, సంప్రదాయ శైలిలో కవిత చెప్పగలవారు మాత్రమే కవులుగా పరిగణింపబడతారు. తదితరులు జాతీయ నుడికార ప్రయోగంలో దిట్టలైనా, భావనలో గొప్ప ఉపజ్ఞులైనా, లోకజ్ఞులైనా వారిని పండితమ్మన్యులుగ తిరస్కరించే వారు.

చివరి కారణం : వేమన రాజులనుగాని, రాజాస్థానాలనుగాని, ఆస్థాన పండితులనుగాని లక్ష్యపెట్టకపోవడం. ఒక పోషకుని ఆశ్రయించి అతని తృప్తి కోసరం అతడిచ్చే తృణమొ పణమొ ఆశించి కవిత్వం చెప్పడమన్నది కవికులాన్ని అప్రతిష్ఠపాలు చేయడమే అని వేమన అభిప్రాయం. ఆత్మస్థైర్యంతో, స్వతంత్రుడై చిత్తశుద్ధి గలవాడే నిజమైన కవి అని, అతడే పదికాలాలపాటు నిలిచే సందేశామీయగలడని వేమన విశ్వాసం. జనన మరణాల పరమావధిని దర్శించడానికి, మానవసేవకు ఉపయోగపడని విద్యాపాండిత్యాలు నిష్ప్రయోజనమైన అలంకారాలని వేమన దృఢాభిప్రాయం. ఇటీవలి కాలం వరకు కవులందరు రాజాశ్రయాల్ని లేదా అధికారుల శ్రీమంతుల కొలువును, ప్రాపును అభిలషించి జీవించినవారే. అందువల్ల వేమన యొక్క స్వతంత్ర ప్రవృత్తిని అహంకారంగా చిత్రించి ద్వేషించారు. పైగా కవులు తమ సాహిత్య తూణీరంలో బలీయమైన మౌనతిరస్కారమనే బాణంతో వేమనను రూపుమాపడానికి ప్రయత్నించారు. అయితే మతసాంఘికరంగాలలో ఒక గొప్ప సంస్కర్తగ పేరు గడించిన వీరేశలింగం వేమన విషయంలో ఎందుకు ఆ కుత్సితుల గుంపులో చేరాడు? శుద్ధ నైతికవాది అయిన వీరేశలింగానికి వేమన పద్యాలలో పరకర్తృకాలై, ప్రక్షిప్తాలుగా వున్న అశ్లీల పద్యాలు కొన్ని ఏవగింపు కలిగించి వుండవచ్చు.

తెలుగు సాహిత్య పరిషత్తు నుండి వేమన వెలివేయబడినా అతని కవిత్వాన్ని కొద్దో గొప్పో చదివిచూచిన ప్రతి విదేశీయుని మీద అది చెరగని ముద్రవేసింది. అట్టి విదేశీయుల్లో అబె జె. ఏ. దుబాయ్ (Abbe J. A. Dubois) అనే ఫ్రెంచ్ రచయిత ప్రథముడు. ఇతడు హైందవుల ఆచారాలు, సంప్రదాయాలు, పూజా పురస్కారాలకు సంబంధించిన "Hindu Manners, Customs and Ceremonies" అనే గ్రంథాన్ని ఫ్రెంచి భాషలో రచించాడు. దానికి ఆంగ్లానువాదం 1871. వ. సంవత్సరంలో మొదట ప్రచురింపబడింది. ఆ గ్రంథంలో "దార్శనికత ధ్వనించే రచనలు" చేసిన భారతీయ కవులను పేర్కొంటూ దుబాయ్: " సుప్రసిద్ధులైన అట్టి కవుల్లో వేమన ఒకడు. ఈ వేదాంతి కడపమండలంలో రెడ్డికులంలో పుట్టి 17వ. శతాబ్దాంతంలో మరణించినట్లు జనశ్రుతి. నేను పరిశీలించిన వేమన పద్యాలు చాల ఆసక్తిదాయకంగ వున్నాయి ఆయన కవిత వివేచన ప్రధానంగా, స్వతంత్ర భావాలతో విశిష్టంగ ఉంటుంది" అని ప్రశంసించాడు.

ఇంతకు ముందు పేర్కొన్న మద్రాసు సివిల్ సర్వీసు ఉద్యోగి అయిన చార్లెస్ ఫిలిప్ బ్రౌన్‌కు వేమన కవితతో సన్నిహిత పరిచయమున్నది. అయితే బ్రౌన్ మహామేధావికాక భాషాశాస్త్రజ్ఞుడు కావడం చేత వేమన కవితను అతడు భాషాదృష్టితో పరిశీలించాడు. "తెలుగుభాషను అభ్యసించదలచుకొన్నవారికి ఉపయోగకరంగ సరళమైన శైలిలో, విషయ వైవిధ్యంతో కూడిన కవితను చెప్పిన కవులెవరని" బ్రౌన్ అన్వేషిస్తున్నపుడు అతని కంటబడిన వాడు వేమన. ఇట్టి పరిమిత పరిధిలో వేమనతో సరితూగగలవాడు యూరోపియన్ కవుల్లో గ్రీసు దేశస్థుడైన లూసియన్ (Lucian) ఒక్కడే తనకు కనిపిస్తున్నట్లు బ్రౌన్ పేర్కొన్నాడు "గ్రీకు వాఙ్మయంలో లూసియన్ కవివలె తెలుగు సాహిత్యంలో వేమన తెలుగు భాషా సాహిత్య ప్రారంభకులకు ఉపయోగకారి" అని బ్రౌన్ అభిప్రాయం. అంటే వేమన రచనలు తెలుగులో ప్రాథమిక వాచకాలకు తుల్యాలు; అట్టి వాచకాల ప్రయోజనాన్ని వేమన రచనలు నిర్వహించగలవని బ్రౌన్‌కు తోచింది. ఇటువంటి అభిప్రాయాన్ని వ్యక్తపరచినందుకు మనం బ్రౌన్‌ను నిందించనక్కరలేదు. ప్రప్రథమంగ వేమన పద్యాలను సేకరించి, పరిష్కరించి, తన సంపాదకత్వంలో వాటిని ముద్రించి, ప్రచురించిన మహనీయుడు బ్రౌన్ దొర. వేమన పద్యాలను ఇంగ్లీషు, లాటిను భాషల్లోకి మొట్ట మొదట అనువదించిన వాడు కూడ బ్రౌనే. వేమన పట్ల బ్రౌన్ చూపిన

శ్రద్ధాసక్తుల వల్లనే తెలుగు సాహిత్యవేత్తలు చిట్టచివరకు వేమనను గుర్తింపడం జరిగింది. బ్రౌన్ "The Verses of Vemana: Moral, Religious, and Satirical" అనే పుస్తకాన్ని ప్రచురించాడు. అందలి పీఠికలో వేమన పద్య సేకరణలో తాను పడిన పాట్లను బ్రౌన్ ఇలా వివరించాడు:

"ఒక భాషను నేర్చుకోడానికి పూనుకొన్నప్పుడు విదేశీయుడు సాధారణంగా దేశీయులలో బాగా ప్రచారంలో వున్న పుస్తకాలను, ముఖ్యంగా సులభ శైలిలో గల వాటిని గురించి అడిగి తెలుసుకోవడం సహజం. అట్టి పుస్తకాలను గురించి 1824. వ. సంవత్సరంలో వాకబు చేసినపుడు ఇందులో సమకూర్చిన పద్యాలతో పరిచయం ఏర్పడింది. వేమ, వేమన అనే రెండు పేర్లతో వున్న అనేక తాళపత్రప్రతులు నాకు లభించాయి. నా ఉద్యోగ బాధ్యతల మధ్య లభించిన తీరిక వేళల్లో వాటిని చదివి కొన్ని పద్యాలను ఇంగ్లీషులోకి అనువదించాను. మూలంలో అనేక దోషాలు-శబ్దదోషాలు, లేఖన దోషాలు, ఛందోభంగాలు మొదలైనవి-కొల్లలుగా కనిపించాయి. ఏ రెండు ప్రతుల్ని పోల్చి చూచినా పాఠభేదాలుండేవి. రెండు వందల నుండి ఎనిమిది వందల పద్యాలవరకు పాఠక్రమాల్లో వైవిధ్యం కనిపించింది. అపుడు నేను మచిలీ పట్టణంలో వున్నాను. స్థానికంగా లభించిన ప్రతుల్ని సేకరించిన తరువాత విశాఖపట్టణం, నెల్లూరు, గుంటూరు, కడప, మదరాసులలో లభించిన ప్రతుల్ని కూడ సంపాదించాను. నేను సేకరించిన ప్రతులలో సమానంగా ఉన్న పద్యాలను గుర్తించడానికి తొమ్మిది ప్రతులకు సంబంధించి తొమ్మిది విభాగాలు గల ఒక పద్య సూచికను తయారు చేయించాను. నాకు లభించిన పద్యాలు మొత్తం 2,500; వీటిని పోల్చినపుడు సమానమయిన పద్యాలు మొత్తం రెండు వేలకు కొంచెం మించి వున్నట్లు తేలింది.

ఆ తరువాత ఈ పద్యాలను ఒక క్రమంలో విభజించి కూర్చవలసి వచ్చింది. నేను నియమించిన లేఖకులు తమ యిష్టా యిష్టాల్ని బట్టి పద్యాలను వర్గీకరించారు. వాటిలో ఏక్రమమూ కన్పించలేదు. చివరకు నేనే ఒక విధంగ మొత్తం పద్యాలను అయిదు వర్గాలుగ మతం, నీతి, వ్యంగ్యం, తాత్త్వికం, ప్రకీర్ణం-అని వర్గీకరించాను."

బ్రౌన్ తరువాత డా॥ జి. యు. పోప్ (Dr. G. U. Pope) మేజర్ ఆర్. ఎం. మెక్‌డోనల్డు (Major R. M. Macdonald) వేమనను ముఖ్యంగా అభిమానించిన పాశ్చాత్యులు. అబే దుబాయ్ (Abbe' Dubois) రచించిన Hindu

Manners' Customs and Ceremonies అన్న గ్రంథానికి సంపాదకీయాన్ని వ్రాసిన పోప్‌దొర : "వేమన పద్యాల మాధుర్యాన్ని అనుప్రాస యమకాల లయని మించిన మరో కవితలేదు." అని ప్రకటించాడు.

వేమన కవిత్వాన్ని గూర్చి మ్యాక్‌డోనాల్డ్ అభిప్రాయమిది. "వేమన రచనలు విదేశీయుల్ని ఆకర్షించినంత గొప్పగా తెలుగు సాహిత్యమంతటిలో మరొక కవి రచనలు ఆకర్షించలేదని చెప్పవచ్చు."

వేమన పద్యాలను ఆంగ్లీకరించిన ద్వితీయుడు కూడ ఒక చార్లెస్. అతని పూర్తి పేరు చార్లెస్ ఇ. గోవర్ (Charles E. Gover) నిజానికి ఇతణ్ని అనువాదకుడనడం సమంజసం కాదేమో! ఎందుచేతనంటే చార్లెస్ ఫిలిప్ బ్రౌన్ చేసిన వచన రూప అనువాదమే తన పద్యరచనకు ఆధారమని గోవరే తెలిపాడు. వేమన సంపూర్ణ హేతువాదిగ, స్థిరమైన ఏకేశ్వరోపాసకుడిగ, మొరటుగ, మాటల ప్రయోగంలో నేర్పరిగ వుండడమే గోవరును అధికంగ ఆకట్టుకున్నది. నైతికంగ వేమన తిరువళ్ళువరు కన్నా చాలా తక్కువని, కవిత్వంలో ఇంకా తక్కువ స్థాయిలో ఉంటాడని గోవర్ అభిప్రాయం. ఈ అంచనా సరియైనదో కాదో కాని విన్సెంట్ ఎ స్మిత్ (Vincent A. Smith) తన Oxford History of India అన్న గ్రంథంలో కులవ్యవస్థను తీవ్రంగా ఖండించిన ఒక భారతీయ రచయిత వాక్యాల్ని ఉద్ధరించడానికి 1871. వ. సంవత్సరంలో ప్రచురితమైన The Folk Songs of Southern India అన్న గోవర్ పుస్తకంలోని వేమన పద్యాలలో నాలుగింటిని ఎన్నుకోవలసి వచ్చింది.

బ్రౌన్, గోవరుల కన్నా వేమనను చక్కగా అవగాహన చేసుకొన్న పాశ్చాత్యుడు క్యాంబెల్ (Campbell) మద్రాసు క్రిస్టియన్ కాలేజి పత్రికలో ఇతర విషయాలతో పాటు ఆయన ఇలా వ్రాశాడు: "నిశ్చయంగ వేమన ప్రజల కవి. ఆయన వ్రాసింది పండితులకు కాదు. నిరక్షరకుక్షులైన గ్రామీణ ప్రజలకు. వేమన ప్రసిద్ధి ప్రచారాలకు కారణం ఆయన ప్రబోధాలే కాకుండా, సరళమూ, శక్తిమంతమూ అయిన ఆయన కవితాశైలి కూడ కారణమే. వేమన పండిత ప్రశంసలను, పేరు ప్రతిష్ఠలను కోరలేదు. కనుకనే సంప్రదాయ కవితా నియమాలను ఉల్లంఘించాడు. ఈ నియమోల్లంఘనలోనే వేమన తన విజ్ఞతను ప్రకటించాడు. గ్రంథరూపమైన సంప్రదాయ కవిత్వం భారతదేశంలో సామాన్య ప్రజానీకానికి అవగాహన కాదు. అది యెప్పటికి

నిరక్షరాస్యులైన ప్రజల ఆదరణను పొందదు....వ్యంగ్యసూక్తివైచిత్రి వల్లనే వేమన ప్రజాదరణను పొందగలిగాడు. మానవ స్వభావంలోని లోటు పాట్లను, ప్రవర్తనలోని పొరపాట్లను సూక్ష్మంగ పరిశీలించి, వాటిని వేమన పరిహాస పూర్వకంగా విమర్శించి ప్రదర్శించాడు....వేమన ప్రధానంగ వ్యంగ్య పరిహాసకుడు మాత్రమే కాడు. తోటి ప్రజలకు సేవ చేయాలన్న తీవ్ర కాంక్ష గల ఒక సంస్కర్త కూడ. ఈ లక్ష్యసాధనకు అతనికి ఏదీ అడ్డుగా కన్పించలేదు. ఈ విశ్వాన్ని గురించిన వేమన సిద్ధాంతం అనేక భారతీయ దార్శనికులలో కనబడే బహుదైవ భావం కాదు. అది ప్రధానంగా ఆస్తిక భావం. సర్వేశ్వరునికి వ్యక్తికి మధ్య గల అంతరాన్ని వేమన గుర్తించాడు. మానవశక్తికొక స్థానాన్ని, ప్రాధాన్యతని వేమన ఆపాదించడం వల్లనే ఆ సర్వేశ్వరుని హస్తాల్లో మానవులు కేవలం కీలుబొమ్మల్లాంటి వారనే వాదాన్ని వేమన నిరాకరించాడు. సన్యాసుల కాముకత్వాన్ని, కఠిన నియమాలని తీవ్రంగ ఖండించడంలో లూథర్, విక్లిఫ్‌ల (Luther, Wycliffe) వంటి మత సంస్కర్తలు కూడ వేమనకు సాటిరారు.

క్రమంగా ప్రజాదరణను పొందుతున్న వేమన కవిత్వ మొక ప్రక్క భారతదేశంలో మత సాంఘిక నైతిక రంగాలలో ఏర్పడుతున్న మార్పులు మరొక వంక, అప్పటి వరకు తెలుగు సాహిత్యవేత్తలు వేమన పట్ల చూపుతూ వచ్చిన తిరస్కార భావం, ఉదాసీనత తొలగడానికి కారణాలయ్యాయి. అంత కన్నా ముఖ్యంగ పేర్కొ దగ్గ విషయం *1914*. వ. సంవత్సరంలో వెలువడ్డ డా॥ సి. ఆర్. రెడ్డిగారి కవిత్వతత్వ విచారం అనే అపూర్వ సాహిత్య విమర్శగ్రంథం. ఈ గ్రంథమొక ఫిరంగిలాగ అప్పటి వరకు అభేద్యంగ వున్న సాంప్రదాయక సాహిత్య విమర్శకుల కోట గోడల్ని కొంత కూల్చింది. డా॥ రెడ్డిగారికి కౌమారదశలోనే భారతేతి హాస కావ్యాలనన్నింటిని వారి తండ్రిగారు పరిచయం చేశారు. ఆ తరువాత మదరాసులోను, కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయంలోను విద్యనభ్యసించిన రెడ్డిగారు పాశ్చాత్య సాహిత్య తత్వాన్ని చక్కగా ఆకళించుకొన్నారు. నిశితమైన ఆలోచన, సున్నితమైన హాస్యం ఆయనకు స్వాభావికంగ సిద్ధించిన లక్షణాలు. ప్రవృత్తి చేత, శిక్షణ చెత రెడ్డిగారు ఆధునిక దృక్పథం కలవారు. ఆయన తన సాహిత్య విమర్శ గ్రంథంలో తన ప్రతిభాపాటవాలను ప్రదర్శించాడు. ఈ గ్రంథమొక మహా ప్రభంజనంలా వీచి అప్పటి వరకు తెలుగు సాహిత్యరంగంలో పాతుకొని వున్న సంకుచితాభిప్రాయాల

మహా వృక్షాన్ని కూకటి వేళ్ళతో కూల్చివేసింది. ఇప్పటికీ తెలుగు సాహిత్య విమర్శలో రెడ్డిగారి గ్రంథానికి అగ్రస్థానం కద్దు. ఒక నూతన విమర్శకళకాన్ని సృష్టించిన ఈ పుస్తకంలో పి. ఆర్. రెడ్డిగారు ప్రముఖులైన తెలుగు కవుల్లో వేమన ఒకడని చాటారు. సృజనాత్మక శక్తికి, సునిశిత హాస్యానికి వ్యంగ్యానికి, స్వాభావికతకు, నిస్సంకోచమైన భావప్రకటనకు, మూఢవిశ్వాసాలఖండనకు, కాపట్యనిరసనకు తెలుగు వాఙ్మయంలో వేమనను మించిన కవి లేడని రెడ్డిగారి అభిప్రాయం.

తమ అభిప్రాయాలు, సిద్ధాంతాలు నిరాధారమైనవని గ్రహించిన పండితులు, విద్వాంసులు వేమనను, వేమన కవిత్వాన్ని ప్రశంసించడం ప్రారంభించారు. సహజం సజీవం, శక్తిమంతం అయిన వేమన కవితను ఎవ్వరూ చూపుమాపలేరు. స్వమాతాభిమానంతో, కులగర్వంతో శుష్కమైన విమర్శతో మన ప్రాచీనులు అంధఃప్రాయులు కాకుండ ఉండినట్లయితే వేమనను ఒక మహాకవిగా ఏనాడో గుర్తించి వుండేవారు. శక్తిమంతమయిన వాక్కు, బలీయమైన వ్యక్తిత్వం వల్ల వేమన తన జీవితకాలంలోనే మహిమాన్వితుడైన ఒక మహాపురుషుడుగా పరిగణింపబడ్డాడు.

# వేమనను గురించిన గాథలు

## ప్రాచీనగాథల ఒడిలో ప్రగాఢ నిద్ర-కీట్స్

తన జీవితకాలంలోనే ఒక దివ్యపురుషుడుగా కీర్తికెక్కిన వేమనను గూర్చి జీవితాంతరకాలంలో కుప్పతిప్పలుగ గాథలుప్పతిల్లడంలో ఆశ్చర్యంలేదు. అనేక విషయాలలో వేమన విలక్షణమైన వ్యక్తి. ప్రవర్తనలో, వేషధారణలో, దిగంబరత్వంలో, ప్రవృత్తిలో, ప్రబోధంలో ఇంకా అనేక విషయాలలో ఆయన విశిష్టుడు. వేమన విశిష్టత ఎటువంటిదంటే అనేకులు అతణ్ణి మహాత్ముడని భావించి పూజిస్తే, మరికొందరాయన్ను పిచ్చివాడిగ, కపటసన్యాసిగా పరిహసించారు. అటువంటి వ్యక్తిని గురించిన గాథలు ఏకాలంలోనైనా, ఏ ప్రాంతంలోనైనా, అతి వేగంగా వ్యాపిస్తాయి. దేనినయినా గ్రుడ్డిగ నమ్మే సమాజంలో, వార్తాప్రచార సౌకర్యాలు అతి తక్కువగనున్న కాలంలో వేమన జీవించాడు. కాబట్టి విపరీతమైన, అత్యద్భుతమైన విచిత్రమైన అనేక గాథలకు ఆయన పాత్రుడయ్యాడు.

వేమన అనుయాయులు ఆయన్ను దైవంగ, గురువుగ పూజించేవారు. ఆ పుక్కిటి పురాణాలను, విపరీతగాథలను, వాస్తవాలని ప్రగాఢంగ విశ్వసించారు. ఆ గాథలలో చిత్రింపబడిన వేమనే వారి దృష్టికి హిమవత్పర్వతం వంటి వాస్తవ పురుషుడు. పరమ పవిత్రుడు. కల్పిత గాథల తెరను తొలగించి చారిత్రక పురుషుడుగ వేమనను ఆవిష్కరించే యే ప్రయత్నమైనా వేమన భక్తుల దృష్టిలో మహాపచారమే. ఇట్టి భావం వేమన భక్తులకే కాక సామాన్యేతరుల్లో కూడ వేలకొలది మందికి వున్నది.

వేమన జీవితాన్ని గురించిన సవిమర్శక గ్రంథం తెలుగులో ఒక్కటే ఉండగా, ఆద్యంతం వింత గాథలతో నిండిన వేమన జీవిత చరిత్రలు దశాధికంగ లోకంలో ప్రచారంలో ఉండడం ఇట్టి భ్రమకు దారి తీసింది. ఇంగ్లీషులో వున్న వేమన జీవిత చరిత్ర కూడ ఒక్కటే. ఆ గ్రంథకర్త సి. రామకృష్ణారావు. ఈ గ్రంథం కూడ పుక్కిటి పురాణాల పుట్ట. వేమన జీవిత చరిత్రను రచించిన తొలి

రచయితలలో మచిలీపట్టణానికి చెందిన ఆర్. పూర్ణయాచార్యులు ఒకరు. ఆయన జిల్లా పోలీసు ఆఫీసులో ఒక గుమస్తా. ఆతనికి చదువు, సంపద అంతంత మాత్రమే. అయినా వేమనపట్ల అతనికి గల భక్తి శ్రద్ధలు అపారం. బ్రౌన్ దొర ప్రారంభించిన తాళపత్ర గ్రంథ సేకరణ కార్యక్రమాన్ని కొనసాగించాలన్న పట్టుదలతో వేమన పద్యతాళపత్రప్రతుల నిమిత్తం దేశం నాలుగు చెరగుల గాలించాడు. ముఖస్థంగ ప్రచారంలో ఉన్న వందలాది వేమన పద్యాలను వ్రాసుకొన్నాడు. లోకులు తెలిసిన వేమన కవిజీవిత విశేషాలను సేకరించాడు. బహుకాల పరిశ్రమ ఫలితంగా 1918. వ. సంవత్సరంలో వేమన పద్యాల సంకలనాన్ని ప్రచురించాడు ఇందులో మొత్తం 1395 పద్యాలున్నాయి. ఇది అంతకు పూర్వమున్న వేమన పద్య సంకలనాలన్నింటికన్న పెద్దది. కట్టుకథలు గల "వేమన యోగీంద్ర చరిత్రము" అన్న పేరుతో ఒక గ్రంథాన్ని కూడ పూర్ణయాచార్యులు రచించి ప్రకటించాడు. ఆతని దృష్టిలో వేమన—వ్యాసమహర్షికి ప్రియమైన ఉపమానంలో చెప్పాలంటే-ఒక పురుష వృషభుడు.

హేతువాదాన్ని త్రోసి పుచ్చి, పురాణ ప్రపంచపు సంధ్య వెలుగులో విహరించదలచుకుంటే పూర్ణయాచార్యుల "వేమన యోగీంద్రుని చరిత్రము" కూడ చదవడానికి ఆసక్తిదాయకంగ ఉంటుంది. వేమన శిష్యులు, ఆరాధకులు చూచినట్లే మనమూ వేమనను దర్శించాలనుకుంటే ఆ గాథా ప్రపంచంలోకి ప్రవేశించవచ్చు. ఆ అద్భుత ప్రపంచంలో సుదూరం ప్రయాణిస్తే తప్ప, ఈ గాథల వెనుక అదృశ్యంగా వున్న వేమనగారి వాస్తవరూపాన్ని సందర్శించలేమన్న విషయాన్ని గుర్తుంచుకోవాలి.

అనగా అనగా ఒకాయన దేశసంచారానికి బయలుదేరాడు. ఆయన పేరు వేమన. ఆయన వైశ్యుడు. అంటే కోమటి. శ్రీ శైలక్షేత్ర దర్శనార్థం ప్రయాణమయ్యాడు. కర్నూలు జిల్లాలో ముండ్లతుప్పలతో నిండిన కొండల్లో వున్న క్షేత్రమది. ఆ కొండ చరియలు కృష్ణానదీ తీరం వైపుకు ఏటవాలుగ వున్నాయి. ఆ పర్వత శిఖరాన వున్న ప్రాచీన శివాలయంలో వెలసిన దైవం మల్లికార్జునస్వామి. ప్రతియేట శివరాత్రి పర్వదినాన వేలాది శివభక్తులు శ్రీ శైలానికి వస్తారు. వారు పగలంతా ఉపవసించి, రాత్రంతా జాగరణ చేస్తారు. కృష్ణానదిలో స్నానమాడి, నొసటికి భుజదండాలకు విభూది రేఖలు దిద్దుకొని, శంఖాలను పూరిస్తూ, తాళాలు తప్పెట్లను వాయిస్తూ,

ఆడుతూ, పాడుతూ దైవారాధన చేస్తారు. 13వ శతాబ్దాంతంలో అట్టి శ్రీ శైలయాత్రి కుల్లో మన కోమటి వేమన ఒకడు.

శివరాత్రికి వచ్చిన యాత్రికులందరూ మరునాడు గృహోన్ముఖులై వెళ్ళి పోయారు. వేమన మాత్రం వెళ్ళలేదు. దేవాలయ ప్రాంగణంలోనే వేమన తచ్చాడు తుంటే, అక్కడ నుండి వెళ్ళిపొమ్మని పూజారులతనిని ఆజ్ఞాపించారు. "నన్నెందుకు తరుముతున్నారు? నేనొక శివభక్తుణ్ని. శివుడను గ్రహించి, దర్శనమిచ్చేవరకు పూజలు చేయ నిర్ణయించుకున్నాను." అని వారితో మనవి చేసుకున్నాడు. అర్చకులు అనుమతించారు. అయితే దేవాలయానికి ఉత్తరాన వున్న పొదల వైపు మాత్రం పోవద్దని ఆదేశించారు. "ఆ పొదలలో సర్పాలున్నాయి. క్రూరమృగాలు అటువైపు తిరుగుతుంటాయి." అని హెచ్చరించారు. వారి హెచ్చరిక వేమనకు సూచనగా పరిణమించింది. పూజారులు ఆదమరచి వున్నపుడు వేమన ఆ నిషిద్ధ ప్రదేశంలో ప్రవేశించాడు. తిరిగి వచ్చేటప్పుడు త్రోవ తప్పిపోకుండా రావడానికి ఆవగింజల్ని వంకరటింకరగా వున్న దారి పొడుగున చల్లుతూ దట్టమైన చెట్ల మధ్యకు వెళ్ళాడు. ఎన్నో ప్రయాసలకులోనై, ఎంతో నిశితంగ పరిశీలించిన తరువాత వేమన "పరుస వేది" కొలనును సమీపించాడు. నిజానికి వేమన శ్రీ శైలయాత్ర పరుసవేది అన్వేషణార్థమే. తాను కనుగొన్న కొలను పరుసవేదియేనా అని నిర్ణయించుకోడానికి ఆ పుష్కరణి జలాలలో ఒక ఇనుప కడ్డిని ముంచాడు. ఆశ్చర్యం! అది బంగారు కడ్డిగ మారింది. పట్టరాని ఆనందంతో ఆ పుష్కరణి జలాలను రెండు కడవల్లో నింపుకొని ఆవగింజల ఆచూకితో వేగంగ దేవాలయ పరిసరాలను సమీపించాడు.

పూజారుల కంటబడకుండ తప్పించుకొని చుట్టుమార్గంలో వేమన అనుము కొండను చేరుకొన్నాడు అప్పటికి సూర్యాస్తమయమయినది సంధ్య చీకట్లు ముసురుకొంటున్నవి. దొంటి అళియరెడ్డి (కొన్ని ప్రతులలో దొంటి అల్లాడరెడ్డి) అనే కాపు ఇంటిలో ఆ రాత్రికి ఆశ్రయమిమ్మని వేమన వేడుకొన్నాడు. ఆ కాపు తమ పశువుల కొట్టంలో ఉండమని అనుమతించాడు. వేమన పుష్కరణి నీళ్ళకడవ లను కొట్టంలోని నాగళ్ళ వెనుక దాచి, భోజనం నిమిత్తం వైశ్యుల ఇండ్లకు వెళ్ళాడు. వేమన భోజనార్థం వెళ్ళిన ఆ సమయంలో అళియరెడ్డి పశువులకు గ్రాసం పెట్టను కొట్టంలోకి వెళ్ళాడు. అక్కడ బంగారంలా తళతళ మెరుస్తున్న వస్తువుని చూచి ఆశ్చర్యపోయాడు. తన నాగలొకటి బంగారంగ మారింది. ఆ

మార్పుకు కారణాన్ని అతడు పరిశీలించినపుడు పరుసవేది స్పర్శ వలన ఇనుము సువర్ణంగ మారినట్లు కనుగొన్నాడు. అళియరెడ్డికి మెరుపు లాంటి ఆలోచన వచ్చింది. వెంటనే ఆ రెండు కడవల్ని తన ఇంట్లోకి చేర్చి పలుగులకు కట్టిన పశువుల్ని విప్పి బయటకు తోలి, కొట్టపు ఎండు గడ్డి మారుకు నిప్పంటించాడు. అగ్నిజ్వాలలు పైకెగసి నింగి ఎర్రబడుతుండగా వేమన పరుగు పరుగున వచ్చాడు. కడవల్ని కాపాడుకోవా లన్న ఆతురతతో మంటల్లోకి దూకి అగ్నికి ఆహుతయిపోయాడు వేమన.

అళియరెడ్డి అప్రమత్తుడు. వివేకి. వెంటనే శ్రీమంతుడు కావడానికి అవసర పడలేదు. ఆలోచించి సమయానుకూలంగా పరుసవేదిని విడతల వారిగ ఉపయోగించి అంచెలంచెలుగా ఇండ్లను, పొలాలను, పశువులను సంపాదించాడు. అయితే ఆయన ఆస్తితో పాటు ఆవేదన కూడ పెరగసాగింది. కోమటి వేమన భూతంగా మారి తన ప్రతీకారాన్ని తీర్చుకున్నాడు. అళియరెడ్డికి అనేక కీడుల్ని, ఆపదల్ని కలిగించాడు. అళియరెడ్డి కుమారులు ఒక్కరొక్కరే రోగపీడితులై మరణించారు. ఈ కారణంగా అళియరెడ్డిది తీరని దుఃఖం, ఆరని ఆవేదన అయింది. అతని పుత్రుల్లో ఒక్క ప్రోలయ మాత్రమే ఈతి బాధలను తప్పించుకొని బ్రతికి బట్ట కట్టాడు. అతడు కూడ మిత్తివాతబడితే కుటుంబ సంపదకు వారసుడుగాని, పితృదేవతలకు తర్పణిచ్చేవాడు గాని ఎవడూ వుండడు. అళియరెడ్డి తన మనస్సులోని భీతిని మింగలేక కక్కలేదు. ఇవి కొని తెచ్చుకొన్న కష్టాలని ఇతరులతో చెప్పుకోలేదు. అందుకే అతని ఆవేదన భరింపరానిదయింది.

తాను చేసిన పాపకార్యానికి ఫలితాన్ని త్వరలో అనుభవించాలి అన్న భీతితో అళియరెడ్డి ఒక రాత్రి పడుకున్నాడు. అతనిది కలతనిద్ర. ఆ కలతనిద్రలో ఒక కలగన్నాడు. ఆ కలలో రౌద్రాకారంతో వేమన కనిపించాడు. అళియరెడ్డి కన్నీరు కారుస్తూ వేమన పాదాలపై పడి తన్ను క్షమించమని ప్రాధేయపడ్డాడు. "మిమ్మమ శాంతింపచేయ నేనేమి పరిహారం చెల్లించాలో దయతో సెలవిప్పించండి" అని బ్రతిమలాడాడు. కోమటి వేమన చిట్ట చివరకు కనికరించి అళియరెడ్డిని క్షమించడానికి రెండు షరతులు పెట్టాడు. మొదటిది : అళియరెడ్డి కోమటి వేమన సువర్ణప్రతిమను ప్రతిష్ఠించి, ప్రతి రోజు దాన్ని తన కులదైవంగా పూజించాలి. రెండవది : అతని వంశంలో ఇప్పుడున్న మగబిడ్డకు ఇక ముందు కలుగబోయే మగసంతతికి కోమటి వేముని పేరు పెట్టాలి. ఈ నిబంధనద్వయాన్ని ఏమరకుండ అమలుపరిచితే అళియ

రెడ్డి వంశం తామరతంపరగ వృద్ధి చెంది శ్రీమంతమవుతుంది. అళియరెడ్డి వంశీయులు అనతి కాలంలోనే రాజ్యపాలకులై ఒక శతాబ్దిపాటు యథేచ్ఛగా పరిపాలిస్తారు. ఈ రెండు ఒప్పందాలకు కట్టుబడి వుండడానికి అళియరెడ్డి ఆనందంతో వెంటనే అంగీకరించాడు. మరునాడే వేముని బంగారు ప్రతిమ చేయడానికి సువర్ణకారుల్ని నియమించాడు. ఒక మంచి రోజు చూచి పూజాపునస్కారాలతో, కర్మకాండను జరిగించి తన ఇలవేల్పుగా పూజాగృహంలో ప్రతిష్ఠించాడు. తన కొడుకు ప్రోలయ రెడ్డి పేరును ప్రోలయవేమారెడ్డిగా మార్చాడు

ఆనాటి నుండి కోమటి వేముని భూతం అళియరెడ్డిని పీడించడం మానుకున్నది. అతనికి మరిద్దరు కుమారులు కలిగారు. వారికి అనవోతవేమారెడ్డి, అనవేమారెడ్డి అని నామకరణం చేశాడు. అతని యింట మరల సుఖసంతోషాలు నెలకొన్నాయి. అళియరెడ్డి ఈ విషాద సంఘటనల్ని గుర్తుచేసే ఆ పాత పరిసరాల్ని విడిచిపెట్టి కొత్త ప్రదేశానికి నివాసాన్ని మార్చడం సముచితంగా తోచింది. సకుటుంబంగ అమూల్యమైన పరుసవేది కడవలను తీసికొని అళియరెడ్డి 1323వ సంవత్సరం గుంటూరు జిల్లాలోని కొండవీడనే కుగ్రామానికి తరలి వెళ్ళాడు.

కొండవీటిలో స్థిరపడిన ఒకటి, రెండేళ్ళలోనే అళియరెడ్డి గతించాడు. అతడు మరణించడానికి పూర్వం తన కుమారుడు ప్రోలయవేముడు రాజ్యాభిషిక్తుడు కావటం చూచి ఆనందించాడు. ప్రోలయ పరుసవేది సహాయంతో బంగారాన్ని అధికంగ తయారుచేసి కొండవీటిని బలమైన దుర్గంగ నిర్మించి, సైన్యాన్ని సేకరించి, ఇరుగు పొరుగు రాజ్యాలను ఆక్రమించుకున్నాడు. కాకతీయ సామ్రాజ్యపతనానంతరం బలవంతుడైన రాజులేని కారణంగా ప్రోలయ 1328వ సంవత్సరం స్వతంత్రరాజ్యాన్ని ప్రకటించాడు.

పన్నెండేండ్ల పాలనానంతరం ప్రోలయ వేమన మరణించాడు. అతని తదనంతరం అనవోతవేమారెడ్డి సింహాసనాన్ని అధిష్ఠించాడు. అనవోతునికి ధైర్యసాహసాలు, వీరశౌర్యాలు మెండు. అనేక యుద్ధాలుచేసి తన రాజ్యాన్ని రెండింతలుగ విస్తరింపచేశాడు. అయితే అతని నిర్విరామ దండయాత్రల వలన ఖజానా ఖాళీ అయినది. అన్నగారయిన ప్రోలయ వేమునిలా పరుసవేదిని ఉపయోగించి బంగారం చేయడానికి ఇంకా ఆ అద్భుత జలం మిగలలేదు. అయినప్పటికి అనవోతుని అదృష్టం వీడలేదు.

ఒక రహస్య ప్రదేశంలో తాంత్రిక యోగి ఒకసారి యజ్ఞంచేయ ప్రారంభించాడు. ఆ యజ్ఞం సఫలం కావడానికి నరబలి అవసరం. ఆ యోగి ఒక పేద గొల్లవానికి ధనాశ చూపి యజ్ఞవాటికకు పిలుచుకవచ్చాడు. యజ్ఞగుండంలో మండుతున్న మంటల్లో ఆ గొల్లవానిని త్రోయడానికి ప్రయత్నించాడు. కాని ఆ గొల్లవాడు ప్రాణసంరక్షణార్థం పెనుగులాడాడు. ఆ కుమ్ములాటలో గొల్లవాడు తప్పించుకుని ఆ సిద్ధుడే యజ్ఞగుండంలో పడ్డాడు. ఈ ఆకస్మిక సంఘటనకి బెదరిపోయిన గొల్లవాడు తన కాళ్ళ సత్తువ కొలది పరుగెత్తి తన పూరిగుడిసెను చేరుకున్నాడు. మరు ఉదయం తనకు వెంట్రుక వాసిలో గండం తప్పిన ఆ చోటికి, యోగి ఏమయ్యాడో తెలుసుకోవాలన్న కుతూహలంతో వెళ్ళాడు. అదురుతూ ఆ స్థలాన్ని సమీపించి నఖశిఖపర్యంతం రెండు బంగారు విగ్రహాలు ఆ యజ్ఞగుండంలో నిలిచి వుండడం చూచి ఆశ్చర్యపోయాడు. అతడు అసహనంతో చీకటి పడేవరకు వేచి వుండి, తన భార్యబిడ్డల సాహాయ్యంతో ఆ సువర్ణ విగ్రహాలను తన గుడిసెకు చేర్చాడు. ఆ గొల్లవాడు ఆ విగ్రహాలను చెక్కి చిన్న చిన్న బంగారు తునకల్ని గ్రహించాడు. వాటిని అమ్మి ఆ డబ్బుతో తన పశువుల మందల్ని పెంపొందించుకోవడమేకాక, ఇతరత్రకూడ సంపన్నుడయ్యాడు. ఈ పశువుల కాపరిని అదృష్టదేవత వరించిన వార్తలు కొన్నాళ్ళకు అనవోతునికి అందాయి. అతడు తన భటుల్ని పశువుల కాపరి పూరిగుడిసెను శోధింప పంపాడు. వారు బంగారు విగ్రహాలను కనుగొని రాజా స్వాధీనం చేశారు. దానితో అనవోతుని ఆర్థికస్థితి మెరుగుపడి లేమిచే కలిగిన చింత తీరింది.

ముప్పయి ఏండ్ల మహోజ్వల పరిపాలనానంతరం 1370. వ. సంవత్సరం అనవోతుడు మరణించాడు. అనవోతుని పుత్రుడు కుమారగిరి వేముడు అప్పటికింకా యుక్తవయస్కుడు కానందున అనవోతుని సోదరుడైన అనవేముడు రాజ్యభారాన్ని వహించాడు. అటు తరువాత కుమారగిరి వేముడు సింహాసనాన్ని అధిష్ఠించాడు. ఈ కుమారగిరి వేముడు కవి వేమన తండ్రి కావడమే ఆయన విశిష్టత.

మల్లమ్మ కుమారగిరి దంపతులకు కుమారులు ముగ్గురు. వారిలో కడపటి వాడే వేమన. రెండవ అనవోతుడు లేక పెదకోమటి వేముడు జ్యేష్ఠుడు. రాచ వేముడు రెండవ వాడు. వేమన సోదరులిద్దరు 1396. వ. సంవత్సరం నుండి ఒకరు 1424. వ. సంవత్సరం నుండి మరొకరు రాజ్యాన్ని పాలించారు. రాచవేముని

సైన్యాధిపతుల్లో ఒకరు అతన్ని చంపారు. అంతటితో ఆ వంశం అంతరించింది. కోమటి వేముని భూతం ప్రవచించినట్లే అళియరెడ్డి వంశం నూరేండ్లు మాత్రమే, అంటే - 1328. నుండి 1428. వరకు - రాజ్యాధికారం నిర్వహించింది.

కుమారగిరి ముగ్గురు సంతానంలో వేమన చివరివాడు, చురుకైన వాడు కావడంచేత తల్లిదండ్రులు అతిగారాబంచేసి వేమనను చెడగొట్టారు. వేమనకు చిన్నప్పటి నుండి మొండితనం, సొంత పోకళ్ళు ఉండేవి. యుక్తవయస్సులో విలాసాలకు, భోగాలకు బానిస అయ్యాడు. వివాహబంధం వేమన విశృంఖల విహారాన్ని అరికట్టగలదనే ఆశతో తల్లిదండ్రులు అతనిని పెండ్లి చేసుకోమని కోరారు. వేమన కుంటి సాకులు చెప్పి వారు తెచ్చిన సంబంధాలనన్నిటిని తిరస్కరించాడు. వేమన ప్రవర్తన వారి వార్థక్యంలో తీరని వ్యథను కలిగించింది. వారి మరణంతో వేమనకుండిన ఆ కొద్దిపాటి అడ్డంకులు కూడపోయాయి. వేమన తన ఇరువురు సోదరులలో ఎవరి మాటను కూడ లక్ష్య పెట్టేవాడు కాడు. రాచవేముని సతి రాణి నరసమాంబ. ఈ వదినెగారి మాటను మాత్రమే వేమన గౌరవించేవాడు. ఆమె ఆదరాభిమానాలే కాముకుడైన వేమనను తాత్త్విక కవిగ తీర్చి దిద్దాయి. ఆమె ప్రభావంవల్లనే భోగియైన వేమన యోగిగ మారాడు.

వేమనలో ఈ పరివర్తన రాకపూర్వం అతడొక దేవదాసితో నివసిస్తుండేవాడు ఆ వేశ్య అతనిని నిలువునా దోచుకొంటూ వుండేది. ఆమె వంచనలకు అంధుడైన వేమన ఆమె ప్రీత్యర్థం ఏమి చేయడానికైనా వెనుకాడే వాడుకాడు. అయితే ఒక రోజు ఆ గణికురాలు రాణి నరసమాంబ భూషణాలన్నింటిని తానలంకరించుకోడానికి తెచ్చి యీయమని కోరింది. అప్పుడు వేమన స్థితి అడకత్తెరలో పడ్డ పోక చెక్కలాగయినది. దేవదాసికి "లేదు" అని చెప్పగల ధైర్యం లేదు. వదినెగారిని ఈ నీచమైన కోర్కెను కోరలేడు. కనుక అంతఃపురంలో అన్నపానాలు పుచ్చుకోకుండ చిరచిరలాడుతూ రెండు రోజులు గడిపాడు. నరసమాంబ ఎంతో వేడుకొనగా చిట్టచివరకు వేమన తన మనోవేదనను తెలిపాడు. నరసమాంబ ఒక్క ముక్కురను తప్ప తక్కిన రాజాభరణాలన్నింటిని అతనికి అందించింది. వేమన వెంటనే వాటిని తన ప్రియురాలికి అందచేశాడు. ఆ వెలయాలు నగలనన్నింటిని పరీక్షించి, అందులో లేని ముక్కురను తీసుకొని రమ్మని వేమనను తిరిగి పంపించింది. తిరిగి వచ్చిన వేమనకు నరసమాంబ కొన్ని నిబంధనలను విధించి, ముక్కు

పుడకను ఇచ్చింది. ఆమె విధించిన నిబంధన ననుసరించి వేమన తన స్వహస్తాలతో ఆ ముక్కెరను దేవదాసికి అందించకూడదు. కాని దానిని దేవదాసి పడకగది గుమ్మంపై పెట్టాలి. ఆమె దిగంబరిగ వెనకకు వంగి తన పెదవులతో ఆ ముక్కెరను అందుకొని తీసుకోవాలి. ఈ భంగిమలో నగ్నంగా వున్న ఆమెను వేమన సునిశితంగ ఆ హావమస్తకం పరిశీలించాలి. నాట్యాభ్యాస సమయంలో దేవదాసీలపిల్లలు చాలమందీ నాట్యభంగిమను నేర్చుకుంటారు గనుక ఆ దేవదాసి ఈ గారడీని సులభంగనే చేయగలిగింది. అయితే వంకర తిరిగిన ఆమె నగ్నదేహాన్ని చూచిన వేమనకు ఎంతో ఏవగింపు కలిగింది. ఆ క్షణం నుండి స్త్రీ సంబంధాలను యావజ్జీవితం పరిత్యజించడానికి సంకల్పించుకొన్నాడు.

ఈ హఠాత్పరిణామం వేమనను స్తబ్ధునిగ చేసింది. కొంత కాలం విచారంతో చురుకుదనాన్ని కోల్పోయాడు. వేమనకొక వ్యాపకాన్ని కల్పించితే ఉత్సాహంగ ఉంటాడని నరసమాంబ ఆశించింది. రాజభూషణాలుచేసే స్వర్ణకారులపై పర్యవేక్షకునిగ వేమనను నియమించింది. వదినెగారిపైగల గౌరవంతో వేమన యీ నూతన బాధ్యతలను ప్రీతితో స్వీకరించాడు. అభిరాముడనే కంసాలి ప్రతిదినం పనిలోకి ఆలస్యంగ వస్తున్నట్లు అనతికాలంలోనే కనిపెట్టాడు. వేమన యెన్ని హెచ్చరికలు చేసినా అభిరాముడు వాటిని లక్ష్యపెట్టలేదు. అతని ఆలస్యానికి కారణం చెప్పమని వేమన నిర్బంధించాడు. అభిరాముడు తనకు పూజాపునస్కారాలు అతి ముఖ్యమని పనికి ఆలస్యంగ రావడాన్ని అన్ని రోజులు కాకపోయినా మరికొన్నాళ్ళపాటైనా అనుమతించాలని కోరాడు. కేవలం ఒక జీతగాడు వినమ్రంగనే అడిగినప్పటికి అధికారాన్ని ఇంత ఖచ్చితంగ ధిక్కరించడం వేమనలో కుతూహలాన్ని రేకెత్తించిది. వేమన అభిరాముని జాడలు తెలుసుకోవాలని సంకల్పించాడు. మరునాటి ఉదయం వేమన అభిరాముని రహస్యంగా వెంబడించాడు.

అభిరాముడు ఒక గుహాంతర్భాగంలోనికి పాలుపండ్లతో వెళ్ళడం చూచాడు. ఒక చెట్టు చాటునుండి అభిరాముని చర్యలను గమనింపసాగాడు. అభిరాముడా పాలను, పండ్లను ఒక యోగి పావాల చెంత పెట్టాడు. ఆతురతతో ఊపిరి బిగబట్టి చూస్తున్న వేమనకు చాల సమయం గడచినట్లు తోచింది. ఆ యోగి పేరు లంబిక శివయోగి. భక్తి ప్రపత్తులతో వేచివున్న అభిరాముని ఆ యోగి కండ్లు తెరచి చూచి ఇలా చెప్పాడు : "వత్సా! నీ త్రికరణ శుద్ధితోడి భక్తిని నేను మెచ్చాను,

రేపు నేనీ ప్రదేశాన్ని విడిచిపోతున్నాను. రేపు సూర్యోదయాత్పూర్వమే నా దగ్గరకు రా. నేనే నీకు మంత్రోపదేశం చేస్తాను. అంతేకాకుండ నీకు కొన్ని అమానుషశక్తుల్ని కూడ ప్రసాదిస్తాను." యోగి మాటల్ని వేమన పొంచి విన్నాడు. ఆ యోగి అనుగ్రహించే విస్మయశక్తుల్ని అభిరామునికి మారు తానే పొందాలన్న దృఢ నిశ్చయంతో రాజభవనానికి తిరిగి వచ్చాడు. అంతఃపురానికి వచ్చిన వేమన నరసమాంబను సమీపించాడు. రాణిగారు కోరిన ఒక నగను అత్యవసరంగ చేసి ముగించేవరకు ఆ రాత్రంతా అభిరాముడు రాజభవనపు కార్ఖానాలోనే ఉండేలాగ రాజు ఆజ్ఞాపించాలని అందుకు కారణం మాత్రం అడగవద్దని వేమన నరసమాంబను ప్రాధేయపడ్డాడు. వేమన కోరిక మేరకు రాజాజ్ఞ జారీ చేయబడింది. అలా అభిరాముడు యోగి దర్శనార్థం వెళ్ళకుండ నిర్బంధింపబడ్డాడు. నిర్ణీతకాలానికి అభిరామునికి బదులు వేమన ఆ యోగిని సందర్శించడానికి వెళ్ళాడు. వేమన రాకకు యోగి ఆశ్చర్యచకితుడయ్యాడు. యోగికి సాష్టాంగ ప్రణామం చేసి వేమన ఇలా అన్నాడు : "అభిరాముడు తాను స్వయంగ రాలేని కారణం చేత మీ ఆశీర్వాదాలు అందుకోడానికి తన ప్రతినిధిగ నన్ను పంపాడు". పాదాలకు ప్రణమిల్లి వున్న ఆ యువకుని రాజసం, మనఃపూర్వక విన్నపం ఆ యోగిని ఆకర్షించాయి. కనుక తన దక్షిణహస్తాన్ని ఎత్తి ఇలా ఆశీర్వదించాడు : "పాపమా పేదవాడు జీవితంలో తన అదృష్టాన్ని కోల్పోయాడు. నీవు ధన్యుడవు. లేచి మంత్రోపదేశాన్ని పొందు నాయనా!"

ఒక్క త్రుటిలో వేమన మహాయోగిగా మారి ఆ గుహ నుండి బయట పడ్డాడు. నేరుగ అభిరాముని దగ్గరకు వెళ్ళి ప్రణమిల్లి అతని క్షమాభిక్షను వేడాడు. పశ్చాత్తాపంతో కన్నీరు కారుస్తూ, "నేను నీకు చేసిన ఈ మహాపరాధానికి ప్రాయశ్చిత్తంగ నీ పేరును ఆచంద్రార్కంగ నిలుపుతాను". అని ప్రతిజ్ఞ చేశాడు. ఈ వాగ్దానాన్ని నిలపడానికే వేమన తన పద్యాల మకుటంలో "అభిరామ"ని పేరును పొందు పరిచాడు.

యోగి వేమన అద్భుతశక్తుల్ని ప్రదర్శించాడు. పుచ్చకాయల్ని పండించి శిష్యులకు దానం చేశాడు. అతడు బహూకరించిన ప్రతిపుచ్చకాయలోను బంగారు గింజలుండేవి. అతని తోట నుండి దొంగిలించిన పుచ్చకాయలన్నింటిలో నిండుగ పురుగులుండేవి. కొన్ని సమయాలలో వేమన తన కాతిథ్యమిచ్చే గృహస్థుల

ఇండ్లలోనే మలాన్ని విసర్జించేవాడు. వారేవగించుకొని ఆయనను గృహం నుండి బహిష్కరించితే ఆ మలం శాశ్వతంగ ఆ ప్రదేశాన్ని మైలపరచేది. అలా కాకుండ ఇదొక బాల్యచేష్ట అని, యోగి తమ్ముని గౌరవించాడని వారు భావిస్తే ఆ మలం బంగారంగ మారేది భక్తితో ఆయన మూత్రాన్ని స్వీకరించినా అది సువర్ణజలంగ మారేది.

హేతువాదులెవ్వరూ ఈ మలమూత్రాల పరివర్తనాన్ని నమ్మరు. వాటి దుర్గంధాన్ని నిద్రలో కూడ సహించలేరు. కనుక మనమింతటితో ఈ పుక్కిటి పురాణాలను కట్టిపెడితే బాగుంటుంది.

# మసక వెలుగు

నేడు చీకటిని గుడ్డిదీపాలు వెలిగిస్తున్నాయి,

— ఏ. జి. గార్డినర్

కట్టుకథలోని కల్పనను చరిత్ర అనే ముసుగుతో కప్పుతుంటారు. కాని ఆ ముసుగు చాలా పలచనిది గనుక ఆ కల్పన కనిపిస్తూనే ఉంటుంది. వేమనను గూర్చిన గాథలే ఇందుకు నిదర్శనం. ఆ గాథలు ఒక వంశాన్ని ఆధారంగా గ్రహించి తేదీల వారిగ కూర్చబడ్డాయి. అయినా అవి నిశిత పరిశీలనకు ఒక్క క్షణం కూడ నిలువలేవు.

రెడ్లలో ఈ నాటికీ "వేమ" "వేమన" అన్న పేర్లు ప్రచురంగ లేవు. కాని ఆంధ్రదేశపు కోస్తాతీరంలోని అధిక భాగాన్ని ఒక శతాబ్దికి పైగా పరిపాలించిన రెడ్డి వంశీయులలో అనేకుల పేర్లు "వేమ" అనే ఉన్నది. మన కవి పేరు కూడ వేమనే. కనుక కవి యీ రాజ వంశానికి చెంది వుండాలి. స్వయంగా రాజవంశీయుడు కాకున్నా ఆ వంశంతో సంబంధాన్ని కల్పించడం చేత అతనికి రాజపురుష గౌరవం ఆపాదింప బడుతుంది. ఆ రాజవంశీయుల పేరే కవికి ఉండటం చేత ఈ కట్టుకథకి చరిత్రాత్మ కత, సంభావ్యత సిద్ధిస్తున్నాయి. అంతే కాకుండ రెడ్డిరాజులు కొందరు సుప్రసిద్ధ కవులు, పండితులు, వ్యాఖ్యాతలు కావటం ఈ సంబంధాన్ని మరింత పటిష్టం చేస్తున్నది.

అయితే ఈ రెడ్డిరాజుల పేరులలో "కోమటి" అన్న పదం ఎలా చోటు చేసు కున్నది? చాతుర్వర్ణక్రమంలో మూడవదైన వైశ్యకులానికి పర్యాయపదం "కోమటి". నాల్గవదియైన శూద్రకులానికి చెందిన వారు రెడ్లు. ఒక రెడ్డి కులజుడు వైశ్యుడు కావడం అసంభావ్యం. ఈ అసంభావ్యతని వివరించడం ఎలా? ఒక మారుమూల పేదరికంతో వ్యవసాయం చేసుకుంటున్న ఒకానొక రెడ్డి కుటుంబం ఆకస్మికంగా, అతి వేగంగా సుసంపన్నమై రాచరికాన్ని ఎలా చేపట్టింది? కట్టుకథలలో కోమటి వేమనను రెండు పరుసవేది కథలను కల్పించి, పై రెండు ప్రశ్నలకు చక్కని సమాధానాలను సమకూర్చినట్లు సంతసించారు.

ఇటీవలి చారిత్రక పరిశోధనలు, సాహిత్య పరిశీలనలు పై కట్టుకథలు అసత్యాలని నిరూపించి, క్రింది సత్యాలను వెల్లడించాయి. ఈ రెడ్డిరాజుల ఇంటి పేరు "దొనటి" కాని "పొంటి" కాదు. ప్రోలయవేమునికి పూర్వమే అతని తండ్రికి కూడ "వేమ" అన్న పేరున్నది. ప్రోలయవేముని ముఖ్య పట్టణం కొండవీడు కాదుగాని అద్దంకి. ప్రోలయ తదనంతరం రాజ్యానికి వచ్చిన అనవోతుడు ముఖ్యపట్టణాన్ని అద్దంకి నుండి కొండవీటికి మార్చాడు. కట్టుకథలలో చెప్పబడినట్లు అనవోతుడు ప్రోలయవేముని సోదరుడు కాడు, కుమారుడు. కుమారగిరి వేముని తరువాత రాజ్యాన్ని పాలించిన పెదకోమటి వేముడు అతని పుత్రుడు కాడు. అతని పెత్తండ్రి కుమారుడు. ఈ వంశంలో కడపటి రాజైన రాచవేముడు పెదకోమటి సోదరుడు కాడు. అతని కుమారుడు ఈ చారిత్రకాంశాలన్నీ కవి వేమన రాజవంశీయుడు కాడన్న విషయాన్ని ఎలా నిరూపిస్తున్నవని ప్రశ్నించవచ్చు. దీనికి సమాధానం చాలా సులభం. కుమారగిరి వేముని కనిష్ట పుత్రుడు వేమన అని కట్టుకథలు పేర్కొంటున్నాయి కాని కుమారగిరికి కట్టుకథలలో చెప్పబడినట్లు ముగ్గురు కొడుకులు లేరు. అతని ఏకైక పుత్రుడు బాల్యంలోనే మరణించాడు.

కట్టుకథల్ని, పుక్కిటి పురాణాల్ని అసత్యాలుగ కొట్టి వేయడం చాలా తేలిక. వేమన జీవిత చరిత్రకు సంబంధించిన సత్యాలను సేకరించడం అసాధ్యం కాక పోయినా, కష్టసాధ్యమని మాత్రం చెప్పక తప్పదు. వేమన జీవిత విశేషాలను సేకరించడానికి ప్రయత్నించిన ప్రథమ వ్యక్తి సి. పి. బ్రౌన్. మనకన్నా బ్రౌన్ వేమనకు సమీప కాలంలో జీవించినవాడు. ఇప్పటికి ఒకటిన్నర శతాబ్దం పూర్వమే పరిశోధన ప్రారంభించాడు. ఇప్పటికన్నా వేమనకు సమీపకాలం వాడైన బ్రౌన్ విషయసేకరణ చేయడానికి పరిస్థితులు అనుకూలంగ ఉండినవి. బ్రౌన్ ఎంతో శ్రద్ధతో ప్రయత్నించి కూడ సేకరించినది చాలా స్వల్పం. బ్రౌన్ తాను ఇంగ్లీషులోనికి అనువదించిన వేమన పద్యాలను టిప్పికతో 1829వ సంవత్సరం మొట్టమొదటి సారిగా ప్రచురించాడు. ఆ పుస్తకపు మున్నుడిలో బ్రౌన్ ఇలా పేర్కొన్నాడు.

"వేమన కాపుకులజుడు, కందనూలు (కర్నూలు) నాడులో రాజుగ ఉండిన అనవేమారెడ్డి వంశజుడని కొందరి గట్టి నమ్మిక. గండికోట దుర్గాన్ని వేమన సోదరుడు పాలించినట్లు ప్రతీతి. కందనూలులోని క్రిష్టిపాడు అతని స్వగ్రామమని కొందరి విశ్వాసం. మరికొందరు గుంటూరు మండలంలోని వినుకొండ వేమన

స్వగ్రామమంటారు కడపజిల్లాలోని చిట్వేలులో వేమన జన్మించినట్లు కూడ జనశ్రుతి. ఈ ప్రాంతాలన్నింటిలో వేమనను గూర్చి వాకబు చేసే అవకాశం నాకుండి నది. అయినప్పటికి ఈ లోక వృత్తాంతాలను బలపరిచే ఆధారాలుగాని, వివరాలు గాని నాకు లభించలేదు. వేమన పద్యాలలోని కొన్ని మాండలికాలను పరిశీలిస్తే ఆయన తెలంగాణా ఈశాన్య ప్రాంతపు వాడనిపిస్తుంది. పైన పేర్కొన్న ఊళ్ళు ఈ ప్రాంతానికి చెందినవే. వేమన 17.వ. శతాబ్దారంభంలో జీవించి ఉన్నట్లు ప్రజాభిప్రాయం."

ఈ ప్రచురణకు పూర్వం అనువదించి ప్రకటింపని పెద్ద సంపుటంలో [1] (బహుశ: బ్రౌన్‌కు తన అనువాదపు తీరు సంతృప్తికరంగా ఉండి ఉండక పోవచ్చు.) ఇంతకన్నా నిర్దిష్టమైన అభిప్రాయాలను వెలిబుచ్చాడు. గండికోట సమీప ప్రాంతంలో వేమన జన్మించి ఉండవచ్చు అన్న అభిప్రాయంతో తానేకీభవిస్తున్నట్లు వ్యక్తం చేశాడు వేమన పద్యాలలోని అంతస్సాక్ష్యాన్ని బట్టి వేమన 17 వ. శతాబ్దపు ఉత్తరార్థంలో పద్యరచనను కొనసాగించి 18.వ. శతాబ్దారంభం వరకు జీవించి వున్నట్లు సహేతుకంగ నిర్ణయింపవచ్చునని పేర్కొన్నాడు. వేమన 17.వ. శతాబ్ది పూర్వార్థంలో కాకుండ ఉత్తరార్థంలో జీవించినట్లు బ్రౌన్ అభిప్రాయమని దీనిని బట్టి వ్యక్తమవుతున్నది.

కాని బ్రౌన్‌కు మరల వేమన కాలాన్ని గురించి సందేహం కలిగి వేమన 15.వ. శతాబ్దానికి చెందిన వాడని తెలిపాడు. బ్రౌన్ అనువదించిన వేమన పద్యాల ద్వితీయ ముద్రణ 1839వ సంవత్సరంలో జరిగింది. ఆంధ్రప్రదేశ్‌లోని గ్రంథాలయాలలో గాని, పండితుల వద్దగాని యీ ద్వితీయ ముద్రణ ప్రతులు లభించలేదు. మేజర్ మ్యాక్ డొనాల్డ్ (Major Macdonald) ఈ ద్వితీయ ముద్రణను గూర్చిన కొన్ని వివరాలు తెలిపాడు. "ఈ ప్రతిలో ఆంగ్లానువాదం టిప్పణికల్లేవు. వాటిని తీసివేశారు. మత, నైతిక విభాగాలలో అనేక క్రొత్త పద్యాలు సమకూర్చబడ్డాయి. ప్రథమ ముద్రణలో 693 పద్యాలు మాత్రమే ఉండగా, ఈ ద్వితీయ ముద్రణలో 1163 పద్యాలున్నాయి." ఈ ద్వితీయ ముద్రణలోని యీ క్రింది విషయాలను కూడ

---

1. ఈ సంపుటాన్ని 1967వ సంవత్సరంలో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదు, వాళ్ళు ప్రచురించారు. దీనిలో 1215 పద్యాలు, వాటి ఇంగ్లీషు అనువాదాలు వున్నాయి.

మ్యాక్ డొనాల్డ్ ఉద్ధరించాడు : "వేమన రచనలు ఇప్పటికి సంపూర్ణంగ నాలుగు వందల ఏండ్లు ప్రాచీనమైనవని ప్రజల ప్రగాఢ విశ్వాసం. తెలుగు బసవ పురాణ కర్తకు వేమన సమకాలికుడని జంగముల పరిగణన. వారి అంచనా సరి అయితే వేమన ఇంకా పూర్వుడవుతాడు. బ్రౌన్ ప్రథమ నిర్ణయం ప్రకారం ఆంగ్లకవులైన బేకన్ (Bacon) షేక్స్పియరులకు, ద్వితీయ నిర్ణయం చొప్పున చాసర్ (Chaucer) మహాకవికి సమకాలీనుడవుతాడు." మ్యాక్ డొనాల్డ్ బ్రౌన్ అభిప్రాయాలతో ఏకీభవించలేదు. స్వయంగ తానే కొంత పరిశోధించి విషయసేకరణ చేసి, తదాధారంగ 17వ శతాబ్దపు మధ్యకాలంలో వేమన జన్మించినట్లు నిర్ధారించాడు.

వేమన కాలాన్ని గూర్చి గోవర్ (Gover) కూడ తన అభిప్రాయాన్ని తెలిపాడు. "మహమ్మదీయ మతం, ముస్లిముల పరిపాలనను గూర్చిన ప్రస్తావనలు వేమన పద్యాలలో కనిపించకపోవడం; 10.వ. శతాబ్దానికి తత్సమీప కాలానికి చెందిన తమిళ కవుల శైలిని పోలిన శైలి వేమన కవితకుండడం వలన వేమన కాలం 12వ శతాబ్దాంతంగ ఉండవచ్చు" అని గోవర్ సూచించాడు.

బ్రౌన్ వేమన పద్యాల ద్వితీయ ముద్రణను గోవర్ చూచి ఉన్నట్లయితే తన అభిప్రాయానికి ఉపబలకంగ బ్రౌన్ అభిప్రాయాలను గ్రహించి వుండే వాడే. మహమ్మదీయ మతాన్ని గాని, ముస్లిముల పరిపాలనను గాని వేమన ప్రస్తావించలేదని గోవరనడం పొరపాటు. వేమన పద్యాలలో కనీసం మూడు పర్యాయాలైనా ముస్లిముల ప్రస్తావన ఉన్నది.

క్యాంబెల్ (Campbell) గోవర్‌లా కాక కొంత వరకు మ్యాక్‌డొనాల్డ్ అభిప్రాయాలతో ఏకీభవించాడు. అయినా ఆయన అభిప్రాయాలతో కొంత అనిశ్చయత గోచరమవుతుంది. వేమన 16వ శతాబ్దపు మధ్యకాలానికి చెందిన వాడని క్యాంబెల్ నిర్ణయించాడు. "వేమన ఇప్పటికి 250 ఏండ్ల క్రితం జీవించినట్లు సామాన్య జనాభిప్రాయం." అని తెలిపాడు. వేమన జన్మస్థలాన్ని గూర్చి కూడ క్యాంబెల్‌కు నిశ్చితాభిప్రాయం లేదు. క్యాంబెల్ ఇలా వ్రాశాడు.

"అనేక ప్రదేశాలను వేమన జన్మస్థలంగ పేర్కొంటారు. మద్రాసుకు వాయవ్య దిక్కులో రెండు వందల మైళ్ళ దూరంలో కడపజిల్లాలోని కొండ ప్రదేశంలో వేమన జన్మించి ఉండవచ్చునని మాత్రమే చెప్పగలను. గాని అంతకన్నా

నిర్దిష్టమైన అభిప్రాయాన్ని వెల్లడించలేను. కొంచెం ఉత్తర దిక్కుగ వున్న కడప, కర్నూలు పట్టణాలలో నిస్సందేహంగ వేమన సంచరించాడు. కడప జిల్లాకు నైరుతిగ ఉన్న కటారిపల్లె అన్న గ్రామం వేమన నివాసస్థలం అని జనశ్రుతి. ఇప్పటికీ ఆ గ్రామంలో ఒక కుటుంబీకులు తాము వేమన వంశీయులమని చెప్పుకుంటున్న వారు వున్నారు. వేమన సమాధిని సందర్శింప వచ్చిన వారు యిచ్చే కానుకల్ని స్వీకరిస్తుంటారు.

క్యాంబెల్ శ్రమించే పరిశోధకుడు. వేమన తన జీవిత చరమదశను కటారి పల్లెలో గడిపి, అక్కడే అంతిమశ్వాసను విడిచాడన్న జనశ్రుతి నాధారంగ చేసికొని క్యాంబెల్ ఆ పల్లెను దర్శించాడు. అక్కడ వేమన సమాధిని సందర్శించాడు. వేమన వంశస్థుడనని చెప్పుకుంటూ ఆ సమాధిని పరిరక్షిస్తున్న ఒక వ్యక్తిని కలుసుకున్నాడు. ఆ సమాధి సమీపంలో వికారమైన వేమన దారు శిల్పమున్న ఒక గుడిని చూచాడు "మేము వేమనను తప్ప వేరే దైవాన్ని పూజింపం. వేమనే మా ఇలవేల్పు" అని చెప్పుకునే కొందరు ప్రజలను కూడ క్యాంబెల్ కలుసుకున్నాడు. ఆ గ్రామం నుండి తిరిగి వచ్చిన తరువాత తాను కనిన వినిన విశేషాలనన్నింటిని గ్రంథస్థం చేశాడు.

కటారిపల్లెలో వేమన తమ పూర్వీకుడు అని చెప్పుకునే కుటుంబస్థుల దగ్గర "వేమన చరిత్రము" అన్న తాళపత్ర గ్రంథమున్న విషయం క్యాంబెల్ దృష్టికి ఎవరూ తేలేదు. అదొక శిథిలమైన తాళపత్రప్రతి. దీనికి ఒకే ఒక మారుప్రతి కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తు వారి సేకరణలో ఉన్నది ఈ ప్రతులను పరిశీలించితే "వేమన చరిత్రము" 1845. వ. సంవత్సరానికి చెందినదని తేలింది. "వేమన యోగీంద్ర చరిత్రము" అన్న గ్రంథంలో సంకలితమైన వాటిని మించిన అద్భుత, అర్థరహిత కట్టుకథల సంకలన ఈ వేమన చరిత్రము. అంతేకాకుండ ఇందులో కొన్ని వివరాలు ఈ వేమన యోగి జీవిత చరిత్రకు సంబంధించినవి కాక తుంగ వేముడన్న మరొక వ్యక్తికి చెందినవి. తుంగ వేమన రచించిన శతాధిక పద్యాలు ఈ గ్రంథంలో ఉన్నాయి

పై విదేశీయ విద్వాంసుల తరువాత వేమనను గురించి రచించిన గ్రియర్సన్ (Grierson) వేమన 16. వ. శతాబ్దంలో జీవించినట్లు అభిప్రాయపడ్డాడు.

గ్రియర్సన్ కూడ జనుల్లో వ్యాప్తిలో వున్న కథల్ని ఆధారంగ గ్రహించే ఈ నిర్ణయాన్ని చేశాడు.

వేమనను గురించి పరిశోధనకు పూనుకొన్న ప్రథమాంధ్రుడు కె. వి. లక్ష్మణ రావు. ఆంధ్రదేశంలో చారిత్రక, సాహిత్య పరిశోధనలకు కూడ లక్ష్మణరావే మార్గ దర్శకుడు. లక్ష్మణరావును అనుసరించి అనేకులు వేమనపై శ్రద్ధచూప ప్రారంభిం చారు. వారిలో వంగూరి సుబ్బారావు, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, శేషాద్రి రమణ కవుల జంట, వేటూరి ప్రభాకరశాస్త్రి, బండారు తమ్మయ్య, చాగంటి శేషయ్య, వేదం వేంకట కృష్ణశర్మ ప్రసిద్ధులు. వీరందరు వేమనను గురించి తమకు సాధ్యమై నంత కృషిని చేశారు. కాని వేమన చరిత్ర చుట్టూ ముసిరిన చీకట్లను వీరు వెలిగిం చిన చిరుదివ్వెల మసక వెలుగు పారద్రోల లేకపోయింది. వీరు ఎవరికి తోచినట్లు వారు ఆంధ్రదేశంలోని వివిధ ప్రదేశాలను వేమన జన్మస్థలంగ నిర్ణయించారు. 15.వ శతాబ్దం నుండి 18.వ. శతాబ్దం వరకు ఒక్కొక్క శతాబ్ది వేమన కాలంగ వెల్ల డించారు.

వేమనను గురించి వ్రాసిన తెలుగు రచయితల్లో వంగూరి సుబ్బారావు, రాళ్ళ పల్లి అనంతకృష్ణశర్మగారు మాత్రమే విపులంగా, సహేతుకంగ చర్చించి గ్రంథ రచన చేసిన వారు. 1922.వ. సంవత్సరం వంగూరి సుబ్బారావు విమర్శనాత్మకమైన వేమన జీవితచరిత్రను ప్రకటించారు. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ 1928.వ. సంవత్స రం వాల్తేరు ఆంధ్ర విశ్వకళా పరిషత్తువారి "సర్, రఘుపతి వేంకటరత్నం" ధర్మ నిధి ఉపన్యాసాల అంశంగ వేమనను ఎంచుకొని ప్రసంగించారు. వేమనను గురించి రచించిన రచయితలందరిలో ఈ ఇద్దరు వేమనకు సంబంధించిన అనేకాంశాలలో ముఖ్యంగ వేమన కాలాన్ని గురించి వ్యతిరేకిస్తారు.

వంగూరి సుబ్బారావుగారు వేమన 15వ శతాబ్ది పూర్వార్థంలో జన్మించి వుంటా డని, శ్రీనాధునికి కనిష్ఠ వయస్కులైన సమకాలికులలో ఒకడై ఉంటాడని అభిప్రాయ పడ్డారు. తన నిర్ణయాలన్నింటికి కొమర్రాజు లక్ష్మణరావుగారి అభిప్రాయాలను ఆధా రంగ చూపారు. అంతే కాకుండ కొందరు మధ్యయుగపు కవులు "వేమ" అని ప్రస్తా వించిన సందర్భాలను ఆయన ప్రబలాధారాలుగా పేర్కొన్నారు. కాని యీ ఆధారం పూర్వపక్షానికి నిలువగలిగినంత బలమైనది కాదు. ముందు పేర్కొన్నట్లు 20వ శతా బ్దపు ద్వితీయ దశకం మధ్య నుండే ఆంధ్ర పండిత లోకం వేమనను గుర్తించటం

మొదలు పెట్టింది. అంతకు పూర్వమున్న వారు వేమనను నిర్లక్ష్యం చేశారు వేమనను కవిగనే పరిగణించలేదు. వాస్తవమిది. కనుక ప్రాచీన కవులెవ్వరూ, ముఖ్యంగ విద్వత్కవులైన తురగా రామకవిగాని, ఎడపాటి ఎఱ్ఱాప్రగ్గడ కాని వేమనను కవిగ స్మరించి వుండరు. "వేమ" అన్న పేరు గల రెడ్డిరాజులు కొండ వీటిని, రాజమండ్రిని పాలించారు. వారు ఉదారులైన సాహిత్య పోషకులు. వారిలో కొందరు స్వయంగ కవులు, విద్వాంసులు కూడ. మధ్యయుగపు కవుల పూర్వ కవి స్తుతిలో "వేమ" అన్న పేరు ఉండినట్లయితే అది యీ రెడ్డిరాజులనుద్దేశించినదై వుంటుంది, కాని వేమనయోగి ప్రస్తావన కాదు.

వేమన కాలాన్ని సాధ్యమైనంత వెనక్కు నెట్టి ప్రాచీనంగ చూపాలని వంగూరి ప్రయాసపడితే, రాళ్ళపల్లి ఆ కాలాన్ని ముందుకు త్రోసి అర్వాచీనంగ చూప ఆరాటపడ్డారు. 18.వ.శతాబ్దపు పూర్వార్థంలో వేమన జీవించినట్లు రాళ్ళపల్లివారి అభిప్రాయం. ఖచ్చితమైన ఆధారాలు లేనపుడు మొండిగ వితర్కించడం తొందర పాటవుతుంది. కాని బ్రౌన్ తన తొలి రచనల్లో వేమన జనన (1652) మరణాలకు (18వ శతాబ్దపు తొలి శతాబ్దాలు) సంబంధించి సూచించిన తేదీలు బహుశా సరియైనవి కావచ్చు.

వేమన పద్యాలాధారంగ అతని జన్మస్థలం కొండవీడని వంగూరి వారు నిర్ధారించారు. ఇతరాధారాలు లభించే వరకు కొండవీటినే వేమన జన్మస్థలంగ పరిగణింప వచ్చునని రాళ్ళపల్లివారు అంగీకరించారు. ఈ ఒక్క విషయంలోనే వారిద్దరకు భేదాభిప్రాయాలు లేకుండ ఏకవాక్యత కుదిరింది. వేమన కొండవీటిలో తన బాల్యాన్ని గడిపినాడనడంలో సందేహం లేకున్నా, అతని పుట్టుక మాత్రం మూగచింతపల్లెలో అని కొందరి విజ్ఞుల భావన. వేమన బాల్యదశలో అతని తల్లిదండ్రులు కొండవీటికి వలసపోయి వుంటారని వారి వాదన. రాళ్ళపల్లివారే వాదాన్ని పెంచక, వేమన జన్మస్థలమేదైనా; ఆయన జీవితంలో అధిక భాగాన్ని ఇప్పటి రాయలసీమైన కడప, కర్నూలు జిల్లాలలో గడిపాడని నిర్ధారించారు.

వేమన కులాన్ని గురించి కూడ వాదోపవాదాలున్నాయి. వేమన కాపుకులజుడని రాళ్ళపల్లివారి భావన. వంగూరి, తదితరులు వేమనది రెడ్డికులమని సూచించారు. ఇరువురూ వేమన పద్యాలను తమ కాధారంగ చూపారు. వేమన పద్యాలీ అభిప్రాయ ద్వయాన్ని బలపరస్తున్నవి. తాను కాపుకులజుడనని ఒక స్థలంలో, రెడ్డివంశజుడనని

మరొక స్థలంలో వేమన పేర్కొంటాడు. వేమన పేర్కొన్న దానిలో వ్యంగ్యం లేదు. వేమన తాను కాపునని, రెడ్డినని కూడ తెలపడం వాస్తవమే. ఇటీవలి కాలం వరకు "కాపు" "రెడ్డి" పదాలు సమానార్థకాలుగ వాడబడేవి. 1909వ సంవత్సరంలో ప్రచురితమైన ఎడ్గర్ తర్స్టన్ (Edgar Thurston) రచించిన "దక్షిణ భారతము లోని కులాలు, తెగలు" (Castes and Tribes of India) అన్న గ్రంథంలో "రెడ్డి" అన్నది ఒక ప్రత్యేక కులంగ ప్రదర్శింపబడలేదు. "కాపు" అన్న శీర్షిక క్రిందనే రెడ్ల ఆచార వ్యవహారాలను గురించిన సుదీర్ఘ వ్యాసమున్నది. ఆ వ్యాసంలో "కాపు" "రెడ్డి" అన్న పదాలు పర్యాయ పదాలుగ ఉపయుక్తమయ్యాయి.[1]

బ్రౌన్ "తెలుగు - ఇంగ్లీషు" నిఘంటువులో ఈ పదానికి ఈయబడిన అర్థాలు : "A tenant, a farmer, a cultivator. Arustic or Country man, a subject and a dweller". ఇన్ని అర్థాలలో "రైతు" అన్నదే ప్రచురతంగ వ్యవహారక్షిణ్ణమైనది. "కర్షకుడు" అన్న సంస్కృత పదానికి సమానార్థకంగ తెలుగులో వాడబడుతున్న "రైతు" అన్న పదం నిజానికి తెలుగు పదం కాదు. "రైత్" అన్నది ఉర్దూ పదం. దాన్ని ఉకారాంతంచేసి తెలుగులో గ్రహించారు. ఇటీవలనే "కాపు" అన్న పదం పరిమితార్థంలో కాకపోయినా, కొంతవరకు కుల వాచిగా వ్యవహార రూఢమైనది. కనుక వేమన కాపు-రెడ్డి- ఉభయ వర్ణాలకు చెందినవాడని చెప్పవచ్చు. నిర్దుష్టంగ చెప్పాలన్న నిర్బంధం ఉన్నట్లయితే వేమన రెడ్డికాపు. అంటే రెడ్డి కులానికి చెందిన కాపు. స్పష్టంగ వివరించాలంటే కులం చేత రెడ్డి వృత్తి చేతకాపు.

వేమన మరణకాలాన్ని గురించి కూడ వంగూరి వారికి, రాళ్ళపల్లి వారికి ఏక వాక్యత కుదరలేదు. వేమన తన చరమదశను కటారిపల్లెలో గడిపి మరణించి

---

1. కాపు, రెడ్డి, పదాలు పర్యాయ పదాలుగ 16, 17వ శతాబ్దాలలో ప్రయుక్తమైన దానికి అనువాదకురాలు పాండురంగ మహాత్యంలోని నిగమశర్మోపాఖ్యా నుండి చూపిన ఆకరాలు : (i) క. కాపు కొడుకొక్కరుండు....

(i) క. కాపు కొడుకొక్కరుండు........ పాం. రం మా. 3 : 55.

(ii) సీ. తే. ఎవ్వడా రెడ్డి యింటికి నెగ్గు చాలఁజేయు........" 3 : 68.

(iii) క. ఎడ్ల తనపుఁ గయిసేఁ తల, రడ్డులు నడచిరి ........" 3 : 75.

(iv) తే॥ కాపుఁగోడలు కంచంత కాఁపురంబు .... గాద్పులచి యడికె" 3 : 81

నట్లు వంగూరి వారు భావిస్తున్నారు. స్పష్టంగా వ్యక్తం చేయకపోయినా కటారి పల్లెలోని సమాధి వేమన సమాధిగ వారు అంగీకరిస్తున్నట్లు తోస్తుంది. ఈ విష యంలో రాళ్ళపల్లి వారికి అనేక సందేహాలున్నాయి. క్యాంబెల్ దొరగారి వలె రాళ్ళ పల్లి వారు కూడ స్వయంగ కటారిపల్లెను సందర్శించారు. ఆంధ్ర విశ్వకళా పరిషత్తు ధర్మనిధి ఉపన్యాసలకై విషయాన్ని సేకరిస్తున్న సందర్భంలో ఇప్పటికి 40 ఏండ్ల క్రితం రాళ్ళపల్లి వారు అక్కడికి వెళ్ళారు. కటారిపల్లెలో ఆ సమయంలో వున్న పూజారి వేమన కవివి గ చెలామణి అవుతున్న ఆ గుడి, ఆ సమాధి వాస్త వానికి వేమనవి కావని రాళ్ళపల్లి వారితో చెప్పాడట. కనుక వేమన కటారిపల్లెలో సమాధి పొందలేదు గాని రాయలసీమలో మరెచటనైనా నిర్యాణాన్ని పొంది వుండ వచ్చునన్నది రాళ్ళపల్లి వారి సిద్ధాంతం. వేటూరి ప్రభాకరశాస్త్రి తమకు తెలిసిన సంప్రదాయ ప్రకారం ఆదిశంకరాచార్యులకు వలె వేమన ఒక గుహలో ప్రవేశించి తనువు చాలించి వుంటాడని రాళ్ళపల్లి వారి సూచన. వేమన నిర్యాణం పొందిన గుహ కడప జిల్లాలోని పామూరు గ్రామసీమలో వున్నట్లు వేమన శిష్యపరంపరలో కొందరి నమ్మిక.

వేమన జీవితానికి సంబంధించిన ఈ విషయాలన్నీ ఇంకా వివాదగ్రస్తమైనవే, వీటన్నింటిని గురించి ఇంకా తీవ్రమైన వాదోపవాదాలు కొనసాగుతూనే ఉన్నాయి. పండితులు, పరిశోధకులు తమ వాదాల వలయాలను వదలకుండా వాదించినంతకాలం ఈ వివాదానికి అంతు చిక్కదు.

# ఆతడు మానవుడు

ఆతడు మానవుడు; అన్నివిధాల మానవునిగనే స్వీకరించండి.
అతని వంటి వానిని మరలా నేను సందర్శించబోను.

— షేక్స్పియర్

సామాన్యంగ ఒక జీవిత చరిత్రకారునికి అవసరమైన జననకాలం, జన్మ స్థలం, తల్లిదండ్రుల పేర్లు ఇత్యాది వివరాలను మినహాయిస్తే వేమన పద్యాలాధారంగా, అంతస్సాక్ష్యాన్ని బట్టి అతని జీవితాన్ని పునర్నిర్మించవచ్చు. వేమన జీవిత తాత్త్విక కవి. జీవితమంటే ఏమిటో అనుభవపూర్వకంగ తెలిసికొన్నాడు. జీవితంలో పడరాని పాట్లు పడ్డాడు. జీవితపోరాటంలో కొన్నిమారులు విజయాన్ని, కొన్నిసార్లు పరాజయాన్ని పొందాడు. అన్నివేళలా, ప్రతి సన్నివేశంలో అధిగమించాడు. వేమనకు జీవితమంటే సత్యశోధన; అన్వేషణార్థమైన ఒక సాహస యాత్ర. జీవితంలో నిమగ్నుడై, జీవితంతో బహువిధాల సన్నిహితత్వాన్ని నెరపిన వేమన తన జీవితాన్నేగాక లోకజీవితాన్ని కూడ తన కవితలో ప్రతిఫలించాడు. అక్కడక్కడ తన కవితలో వ్యక్తం చేసిన ఒకానొక భావనలోనో, ఉపమలోనో, విలక్షణమైన నుడిలోనో వేమన వ్యక్తిగతజీవితాన్ని లీలగ తిలకింపవచ్చు. వేమన ఏవగించుకునే వాటిలోను, అభిమానించే వాటిలోను, వేమన జీవితాన్ని సందర్శించవచ్చు. ఆయన అభిమానించే, ద్వేషించే ఆవేదన చెందే వాటినన్నింటిని సమీకరించడంవలన వేమన జీవితాన్ని సంగ్రహించవచ్చు. నిశితబుద్ధితో వేమన వాక్కుల్ని గ్రహింపగలిగిన వారికి వేమన ఆత్మీయత, వ్యక్తిత్వం ఆయన కవితలో గోచరమవుతుంది. అది చేయగలిగితే కవితలో ఆత్మీయతను ప్రదర్శించిన కవులలో వేమనను మించిన వాడు లేడని తెలిసికొంటారు.

వేమన పద్యాలలో ప్రతిఫలించే ఆయన జీవితాన్ని పరిశీలించితే ఆయన రాజవంశీయుడు కాడని తెలుస్తుంది. రాజాంతఃపురం కాదుగాని సాగుభూమి వేమన జీవిత నేపథ్యంగ దర్శనమిస్తుంది. అదొక పెద్ద కమతం కాదుగాని ఒక కుటుంబ సుఖజీవనానికి సరిపడేంత సాగుభూమి మాత్రమే. వేమనది వానాకాలం చదువు.

చదువుకు స్వస్తి చెప్పిన వెంటనే తండ్రికి వ్యవసాయంలో తోడ్పడసాగాడు. ప్రతి ఉదయం పశువుల్ని పచ్చిక బయళ్ళకు తోలుకు వెళ్ళి సాయంకాలానికి ఇంటికి తోలుక వచ్చేవాడు. పొలం దున్నటంలో, నారు నాటడంలో, కలుపు తీయడంలో తోడ్పడేవాడు. మంచె మీద నిలిచి వడిసెలతో గింజలు తినే పిట్టల్ని అదల్చేవాడు. కోత కోయడంలో, పంట నూర్చడంలో, తూర్పారపట్టడంలో చేయూత నిచ్చేవాడు. ఎడ్ల బండి మీద ధాన్యపు బస్తాల్ని ఎక్కించుకొని, ఎడ్లని అదల్చి తోలుతూ, గర్వంగ పంటని ఇల్లు చేర్చేవాడు. ఏ పనినైనా ఆనందంగ చేసేవాడు. పనిచేస్తూ కూని రాగాలు తీసేవాడు. పల్లెపదాల్ని సర్వాతిశయంగ పాడేవాడు. గ్రామ దేవాలయం ముంగిట ప్రదర్శించే వీధి నాటకాల్ని తోలుబొమ్మలాటల్ని చూడకుండ, భారత రామాయణ పారాయణాన్ని వినకుండ ఉండేవాడుకాడు. ఈ మహాకావ్యేతిహాసాల కొన్ని భాగాలను యథాతథంగ ధారణ చేసేవాడు.

వీటన్నింటికన్న సంపన్న సమవయస్కుల స్నేహం వేమనకు అమితానందాన్ని, సంతృప్తిని కలిగించేది. వారి సరదాలు తీర్చడానికి పల్లెచెరువులో ఈత లాడడానికి, సమీప కొండకోనల్లో విహారాల్ని ఏర్పాటుచేయడానికి వేమన కొన్ని మారులు పొలం పనులు మానుకునే వాడు. అగ్రవర్ణాల వారి ఆచారాలను ద్వేషించి అందరితో కలసిమెలసి తిరిగే వాడు. వేమనకు పశుపక్ష్యాదులంటే అభిమానం. పక్షుల్లో కాకి, గుడ్లగూబ; జంతువుల్లో కుక్క, పంది, గాడిదలను అసహ్యించుకునే వాడు. వేమనవి నిర్మొహమాటమైన మాటలు, శీఘ్ర నిర్ణయాలు, సాహస కృత్యాలు. ఆయన నూటికి నూరుపాళ్ళు బహిర్ముఖ స్వభావుడు. వ్యక్తిగత దూషణనుగాని, సామాజిక అన్యాయాన్ని కాని సహించే వాడుకాడు. తరచూ గ్రామంలోని దుండగులతో ఘర్షణ పడేవాడు. తాను ఏది చేపట్టినా దాని అంతు చూచేవాడు. వేమనలో ఉరకలు వేసే ఉత్సాహావేశాలను ఆయన తండ్రి అవాగరికతగ అపార్థం చేసుకున్నాడు.

వేమన తన తల్లిదండ్రులను ప్రేమించి గౌరవించాడు. తల్లికి గారాబు పట్టి వేమన. ఆమె ముద్దుచేసి అతనిని కొంత చెడగొట్టింది. వేమనకు షడ్రసోపేతమైన భోజనమంటే ఇష్టమని ఆమెకు తెలుసు. అందుకే పాలు, పెరుగు, నెయ్యి ఆయనకు ధారాళంగ వడ్డించేది. తండ్రి అతని దుడుకుతనానికి కోపగించితే, తల్లి సర్ది చెప్పి సమర్థించేది. అయితే ఊరి తగవుల్లో తల దూర్చవద్దని తండ్రి చాటుగ

ప్రతిమాలేది. నూనూగు మీసాల నూత్న యౌవనం వరకు వేమన జీవితం నిశ్చింతగ, ఆనందంగా గడిచింది. ఆ ఈడులో తల్లి ఆకస్మిక మరణం వేమనను దుఃఖసాగరంలో ముంచింది. అంతా అంధకారం. వేమన ఒంటరితనంలో అనాథ వలె బాధ పడతాడు.

ఈ దుఃఖం నుండి వేమన పూర్తిగ కోలుకోకముందే తండ్రి ద్వితీయ వివాహం చేసుకుంటాడు. ఆ సంఘటన వేమనకు వజ్రఘాతమై గుండెను ముక్కలు చేస్తుంది. తన తండ్రి మారు మనువు చేసుకోకూడదని వేమన అభిమతం కాదు. "ఎందుకింత తొందర? మా అమ్మపై నిజమైన ప్రేమ లేదా? మరొక యువతిని చేపట్టడానికి ఆమె మరణానికి నిరీక్షించాడా?" అని తనలో తాను మథనపడే వాడు. తండ్రిని గూర్చిన ఇటువంటి ఆలోచనలు నిర్దాక్షిణ్యమైనవని, తన్ను అధికంగ కలత పెట్టే ఈ తలంపులకు దూరంగ ఉండడానికి వేమన ప్రయత్నిస్తాడు కాని అవి అతనిని నీడలా వెంటాడి అంధకారంలోనికి దారి తీసేవి.

వేమన కళాహీనుడై ఎవరితోను కలసి మసలకుండా, అంటీ అంటనట్లుండడం చూచి సవతి తల్లి వేమనకు తనపై ద్వేషమని భావిస్తుంది. నూతన వధువుగ, ఆనందంగ ఆ ఇంట కాలు పెట్టిన ఆమె వేమన చిన్నబోయిన ముఖాన్ని చూచి విసుక్కుంటుంది. ఆమె విసుగు అనతికాలంలోనే అతనిపై తిరస్కారంగ, కోపంగ మారుతుంది. భర్తకు తెలియకుండ చాటుగ ఆమె వేమనను వేధింప ప్రారంభించింది. క్రమంగ భర్త భీతిపోయి బహిరంగంగానే సదా వేమనను పీడించేది. అతడేమి చేసినా, చెప్పినా తప్పు పట్టి తిట్టేది. చలిది అన్నాన్ని పెట్టేది. గోరంతల్ని కొండంతలు చేసి భర్తకు ఫిర్యాదు చేసేది. తండ్రి వేమనను చావబాదినపుడు ఆమె లోలోన మురిసిపోయేది. ఆమెకు ప్రథమ సంతానం కలిగినపుడు వేమన పరిస్థితి ఇంకా దుర్భరమైంది. ఆత్మాభిమానియైన వేమన ఆవేశంతో ఈ చర్యల్ని ప్రతిఘటించేవాడే కాని మరణించిన తన మాతృమూర్తి పట్లగల ప్రేమాభిమానాలు అడ్డు పడేవి. అందు చేత తన తండ్రి జీవితంలో తల్లిస్థానాన్ని ఆక్రమించిన ఈవిడ పెట్టే అవమానాలను తిరస్కారాలను మౌనంగా సహించేవాడు.

వేమన ఇప్పుడు నిండు జవ్వనాన్ని సంతరించుకున్నాడు. ఇంటిలోని అశాంతిని, అసంతృప్తిని తప్పించుకోడానికి వేమన దేవదాసీలను ఆశ్రయిస్తాడు. దేనినైనా అరగొరగ చేసే ప్రవృత్తి కాదు వేమనది. కనుక ఈ విషయంలోను అతిగ ప్రవ

ర్తించి వేశ్యాలోలుడుగ, విటుడుగ మారి అసంఖ్యాకమైన వేశ్యలతో సంచరిస్తాడు. తుదకొక వేశ్య అతన్ని ఆకర్షిస్తుంది. ఆమె అందగత్తె, యుక్త వయస్కురాలు నెరజాణ. శ్రావ్యమైన కంఠం. ముఖ్యంగా తోడిరాగాన్ని మృదుమధురంగ ఆలాపిస్తుంది. వీణను వాయిస్తుంది. ఈ గణికురాలు అనాగరికుడు, మొరటువాడైన వేమన పట్ల ప్రేమాభిమానాలను పెంచుకుంటుంది. వేమనను మృదు స్వభావునిగ, నాగరికునిగ మార్చ ప్రయత్నిస్తుంది. శ్రీమంతుడు కాని వేమన ఒక్కనితోనే తన పుత్రిక స్నేహాన్ని పెంపొందించుకోవడం వేశ్యమాత అభీష్టం కాదు. వేమన అప్పుడప్పుడు కొంత ముట్ట చెప్పినా అది చెప్పుకో తగ్గ పెద్ద మొత్తం కాదు. పైగా క్రమంగ కూడ ఇచ్చేవాడు కాడు. కొంత కాలానికి ఆ చిన్న మొత్తం కూడ ఈయడం మానుకున్నాడు. వెంటనే ఆ వేశ్యమాత వేమన తమ ఇంటి గడప తొక్కకూడదని ఆంక్ష విధించింది ఆ వృద్ధురాలి కన్నుగప్పి తన ప్రియురాలిని కలసికొన వేమన చేసిన ప్రయత్నం విఫలమవుతుంది. ఆ ముసలి దయ్యం వేమనను పట్టుకుంటుంది. గుండె బరువుతో వేమన క్రుంగిపోతాడు. దురాశతో తనకు అడ్డు నిలిచిన ఆ వృద్ధురాలిని హత్యచేయ నిర్ణయించుకుంటాడు. ఇంతలో వేమన ప్రియురాలు మరొక విటుని చేరదీస్తుంది. దీనితో వేమన సంపూర్తిగ నిరాశా నిస్పృహలకు లోనవుతాడు.

వేమన వేశ్యల వ్యామోహంలో నుండి బయట పడడం చూచి వేమన తండ్రి అతన్ని వివాహబంధంతో బంధిస్తాడు. ఆదిలో సంసారం ఆదర్శప్రాయంగ సాఫీగ కొన్నేండ్లు సాగింది. వేమన కిరువురు సంతానం కలిగారు. సుఖసంతోషాల జీవితాన్ని గూర్చి రంగు రంగుల కలలు కంటాడు. అయితే ఈ కమ్మని కల కరిగిపోతుంది. అత్తాకోడండ్ల మధ్య నిరంతర పోరాటం. ఒక్క రోజు కాదు కదా, కనీసం ఒక గంటయినా వారిద్దరు ఘర్షణ పడకుండ గడిచేది కాదు. ఈ ఉమ్మడి కుటుంబంలో ఇమడడం అసాధ్యమని వేమన వేరు కాపురం పెడతాడు. ఆ తరువాత కూడ వేమన కష్టాలు కడతేరలేదు. అవి రెండింతలైనాయి. వేమన గృహిణి సంసారాన్ని చక్కగ నిర్వహించేది కాదు. ఆమె సోమరి. డబ్బును విచ్చలవిడిగ ఖర్చు చేసేది. పొదుపుగ సంసారాన్ని చక్కబెట్టేది కాదు. అతని రుచులకు అనుగుణమైన వంట చేసేది కాదు. ఆ వండిన పదార్థాలనైనా సరిగా వడ్డించేది కాదు. నిరంతరం అతన్ని విసిగించేది. అతనిపైనున్న కోపాన్ని పిల్లలపై చూపేది. వారిని తరచు కొడుతుండేది. సరియైన పెంపకం లేని ఆయన బిడ్డలు వేమన ఆవేదనకు కారకులయ్యారు,

ఉమ్మడి కుటుంబం నుండి విడిపోయిన తరువాత వేమన తన భాగానికి వచ్చిన పొలాన్ని శ్రద్ధగ సాగుబడి చేసేవాడు. చెరకు, నువ్వుల్ని పండించేవాడు. కాని ఇల్లాలి పోరు, ఇంటిలో అసంతృప్తి వలన వేమన క్రమంగ వ్యవసాయాన్ని నిర్లక్ష్యం చేసేవాడు. తత్ఫలితంగ పంట నానాటికి క్షీణించింది. సంతానం పెరగడం రాబడి తరగడం వలన ఇల్లు గడవడం కష్టమయ్యేది. అప్పుచేసి కొన్నాళ్ళు గడిపే వాడు. ఇంతలో పొలంలోని చెరకుకు తెగులు సోకి పంట సర్వనాశనమవుతుంది. పంట పూర్తిగా పాడయి, పెట్టిన పెట్టుబడి నేలపాలవుతుంది. బాకీ తీర్చమని ఋణ దాతలు ఆయనను చుట్టుముట్టి ప్రాణం తీస్తారు. తమ బాకీ చెల్లు క్రింద ఇంటిని, పొలాన్ని వేలం వేస్తామని బెదిరిస్తారు.

ఇటువంటి క్లిష్టపరిస్థితుల్లో వేమన స్వర్ణయోగ విద్యచేత ఆకర్షితుడవుతాడు, రాగి, ఇనుము వంటి క్షుద్రలోహాలను బంగారంగ మార్చే విద్య తెలుసుననే వారి వెంట పడేవాడు. ఆ మోసగాండ్లు ఒక్కొక్కరే వేమనను వంచిస్తారు. ఈ అన్వేష ణలో క్షుద్రమానవ స్వభావాన్ని మేలిమి బంగారు కంటె కూడ విలువైన దానిగ ప్రయోగకరమైనదిగ మార్చగల మార్గాన్ని చూపే గురువును కనుగొంటాడు.

ఇంత వరకు చెప్పినది ఊహాకల్పితమైన వేమన జీవిత గాథా? లేక సహేతుక మైన, సాధ్యమైన నవీన కల్పనా? అవును, కాదు అన్న రెండు సమాధానాలు చెప్ప వచ్చు. ఈ కథనంలోని ప్రతి సంఘటనకు వేమన కవితలో ఒక ఆధారాన్ని చూప వచ్చు. భూమి సాగుబడిని గూర్చిన పరిజ్ఞానం, భోజనంలోని రుచులు, కొన్ని పశు పక్ష్యాదుల పట్ల ప్రీతి, మరి కొన్నింటిపట్ల అయిష్టం, సంగీతం పట్ల, అందునా తోడిరాగం పట్ల అభిమానం, తదితర స్వల్ప విషయాలను గూర్చిన ఇష్టానిష్టాలకు వేమన కవితలో అనేక స్పష్టమైన ఆధారాలు లభిస్తాయి. బాల్యంలోనే తల్లిని కోల్పో వడం, సవతి తల్లి హింసలు, దేవదాసి వ్యామోహం, దుఃఖభాజనమైన గృహ జీవితం ఆర్థిక ఇబ్బందులు, స్వర్ణయోగ విద్యాసక్తి వంటి ప్రధాన సంఘటనలకు ఆధారం అవసరం. వీటిలో ఒక్కొక్కదాన్ని ప్రత్యేకంగ పరిశీలింపవచ్చు.

వేమన ప్రబోధాల్లో మాతృ ప్రేమాభిమానాలు మౌలికమైన అంశాలు. "తల్లి నెరుగువాఁడు దైవంబు నెరుగును" అని[1] ప్రకటించాడు. దీనిని సాధారణమైన

---

1. తల్లి నెరుగువాడు దైవంబు నెరుగును
మన్ను నెరుగువాడు మిన్ను నెరుగు
మిన్ను మన్నెరిగిన తన్నుదానెరుగురా. ॥విశ్వ॥(ఆం ప్ర.అకాడమి ప్రతి ప.336)

ఉపదేశంగ గ్రహించవచ్చు. కాని దీని తరువాతి పద్యంలో ఒక స్వీయానుభవాన్ని పేర్కొంటాడు :

ఆ॥ తల్లియున్నయపుడె తనదు గారాబము
తామె పోవఁ దన్ను నరయరెవరు
మంచికాలమపుడె మర్యాద నార్జింపు. ॥విశ్వ॥
(వావిళ్ళ. పుట. 11)

తల్లి మరణానంతరం నిర్లక్ష్యానికి క్రూర హింసలకు, కఠినానుభవాలకు లోనైనట్లు భావించి ఉండనిచో వేమన యీ పద్యాన్ని చెప్పగలిగే వాడా ? తల్లి జీవించి వున్నపుడు సత్పుత్రుడుగ నిరూపించుకోలేదన్న వ్యథ, దీర్ఘనిట్టూర్పు పద్యంలో ధ్వనించడం లేదా?

ఆ॥ సవతితల్లిఁ జూడసాకుల నెఱపును
సొంత తల్లివలెను సైఁపఁ దెపుడు
వింతలడచిలోని విజ్ఞానమందరా. ॥విశ్వ॥ (వావిళ్ళ పుట.176)

అన్న పద్యం కూడ గణనీయమైనది. దీర్ఘకాలం తల్లిలేని బిడ్డగ, సవతి తల్లి ఆరళ్ళను అనుభవించిన వ్యక్తి తప్ప స్వానుభవంలేని వాడిటువంటి పద్యాన్ని రచింపలేడు.

దేవదాసీ వాగురులలో చిక్కుకున్నాడన్న ఉదంతానికి నిదర్శనం :

ఆ॥ లంజ లంజకాని లాగెల్ల గొనియాడు
లంజ తల్లివాని లజ్జ గడుగు
తల్లి గలుగు లంజ తగులాట దోషంబు. ॥విశ్వ॥
(బ్రౌన్ - 1839.97 - 239)

ఆ తరువాతి కథానికకు ఈ క్రింది పద్యం ఆధారం :

ఆ॥ విటుఁడు తగిలి రోసి విడిచి పెట్టు వెనుక
పిదప నొకఁడు తగిలి ప్రియము సేయు
కుడిచి వైచు పుల్లె కుక్కలు నాకవా. ॥విశ్వ॥
(అకాడమీ ప్రతి ప. 796)

దేవదాసితోడి అనుబంధాన్ని తెగతెంపులు చేసుకొన్నట్లే పద్యంలో ధ్వనిస్తుంది కదా! దెబ్బ తిన్న స్వాభిమానానికి ఊరటగ వేమన చెప్పుకొన్న స్వాంతన పద్యంగ దీన్ని భావించడం దోషమా?

"అప్పులేనివాడె యధిక సంపన్నుండు" (వావిళ్ళ. పుట. 55)

అని వేమన ఋణ బాధలకు లోను కాకూడదన్న హెచ్చరిక ఆయన ఆర్థిక ఇబ్బందులను ఎత్తి చూపుతున్నది.

వేమన దాంపత్య జీవితం, సంసారం వేదనా పూరితాలనడానికి సాక్ష్యాధారాలైన అనేక పద్యాలను చూడవచ్చు. ప్రయత్నలోపంవల్ల వేమన సంసారం దుఃఖమయం కాలేదు. వేమన తన బాల్యంలోనేకాక, దైవాన్వేషణ నిమిత్తం తల్లి దండ్రులను, భార్యబిడ్డలను, సర్వాన్ని పరిత్యజించాలన్న నిర్ణయానికి వచ్చేవరకు వైవాహిక జీవితాన్ని గూర్చి చాల ఉన్నతంగ తలంచేవాడు. అందువల్లనే :

ఆ॥ సుగుణవంతురాలు సుదతియైయుండిన
బుద్ధిమంతు లగుచుఁ బుత్రులొప్ప
స్వర్గమేటి కయ్య సంసారి కింకను. ॥విశ్వ॥
(వావిళ్ళ. పుట. 459)

అని ప్రశ్నించాడు ఇట్టి సదభిప్రాయాన్ని వ్యక్తం చేసిన వాడే తరువాత గయ్యాళులను, కలహకారిణులను దూయబడుతూ, కొఱగాని పిల్లలను నిందిస్తూ, జీవితాన్ని ద్వేషించడానికి కారణం దుఃఖభాజనమైన సంసారం తప్పవేరే ఏముంటుంది![1] గయ్యాళి భార్యను చెప్పులోనిరాయి, చెవిలో జోరీగ, కంటిలో నలుసు, కాలిలో ముల్లుతో పోల్చిన వేమన పద్యం ప్రజల నాలుకలపై నిత్యం నర్తిస్తూనే వున్నది.

---

1. అనువాదకురాలు చూసిన ఆకరం :

ఆ॥ భార్య తనదుపాలి భారపు సంకెల
చిన్న చిన్న శిశువు జింజిరీలు
అరయగ చెఱసాల యగును సంసారము "విశ్వ"
(వావిళ్ళ. పుట. 475)

ఈ విధంగ పునర్నిర్మించిన వేమన జీవితంలో ఆయనకు పరుసవేదిపై గల మక్కువను నిరూపించడమొక్కటే మిగిలింది. ఈ విషయాన్ని నిరూపించే దశాధిక పద్యాలున్నాయి. ఆయన అనుయాయులలో కొందరు ఇప్పటికీ వేమన పద్యాలలో పరుసవేది సూత్రంకొరకు అన్వేషిస్తూనే ఉన్నారు.

వేమన జీవితం పూలబాటకాదు. మిట్టపల్లాలతో అనేక అపాయకరమైన మలుపులతోకూడిన బాట అది. ఎదురురాళ్ళు తట్టుకొని వేమన అనేక మారులు క్రిందపడినా, లేచి నిలదొక్కుకొని ముందుకు కొనసాగిపోయాడు. సగటు మానవుని కన్న అధికమైన శ్రమల్ని, శోధనల్ని, కన్నీళ్ళని వేమన అనుభవించాడు. అవి వేమనను రాటుదేల్చాయి; సంస్కరించాయి; విశాల దృక్పథాన్ని ప్రసాదించాయి; నిర్భీతితో గర్జించే శక్తినిచ్చాయి; సాహసోపేతమైన, సంప్రదాయాతీతమైన తత్త్వాన్ని కలిగిన విశిష్టవ్యక్తిగ రూపొందించాయి.

# చిమ్మ చీకటి

కారుచీకట్ల, నీలినీడల కాళరాత్రి.

—మిల్టన్

ఒక సంపూర్ణవ్యక్తిగా, దార్శనికునిగా, కవిగా వేమనను అవగాహన చేసుకోవడానికి వేమన జీవితం, ఆలోచనాసరళి, కళాదృష్టి వేళ్ళూనిన ఆనాటి సమకాలీన సమాజాన్ని తెలుసుకోవడం అవసరం. అసంగతంగ తోచినప్పటికి సమకాలంలో పాతుకొని, అందుండి జీవాన్ని, జవాన్ని పుంజుకోగలిగిన మేధావియే కాలాతీతుడై, అమరత్వాన్ని అందుకోగలడు. సమాజంలో అస్తిత్వంలేని వ్యక్తియెంత ప్రతిభావంతుడైనా, ఆధారరహితంగా గాలిలో కొట్టుమిట్టాడుతూ, చివరకు మటుమాయమవుతాడు.

సమకాల సమాజంలో దృఢంగా పాతుకుపోయిన ఒక వ్యక్తిలాగ వేమన; "కవిత్వం అన్నది కేవలం ఒక కసరతుకాదు; అది నిజ జీవిత ప్రతిబింబం. భవిష్యత్కాలంలో, భావితరంలో రానున్న ఆదర్శాల ప్రశంసకూడ కవితకాదు. ఒకనికి తాను పీల్చేశ్వాస, తన జన్మభూమి ఎంత సన్నిహితమైనవో కవితకూడ అంత సన్నిహితమైనదే" అని గ్రహించాడు. (ఈ మాటల్ని థామస్‌గ్రేని గురించి రాబర్ట్ లిండ్ చెప్పాడు) కనుకనే వేమన కవిత సమకాలీన జీవితానికి చక్కని దర్పణం పట్టింది. వేమన కవితను విశ్లేషించి పరిశీలించడంవల్ల ఆయన జీవిత గాథను పునర్నిర్మింపవచ్చుననిముందే గ్రహించాం. అలాగే వేమన కవితలల్లుతూ, ప్రబోధాలుచేస్తూ ఆయన జీవించిన యుగపు వాస్తవిక చిత్రాలనుకూడా ఆయన కవితలో దర్శింపవచ్చు. దారిద్ర్యం, అనాగరికత, అవినీతి నిండిపోయిన క్షీణయుగమది. ఐహికాముష్మిక విషయాలలో దారిద్ర్యం; ఆలోచనల్లో, మాటల్లో అనాగరికత; అన్నింటిలో అసభ్యత వెల్లివిరిసిన కాలమది. భారతదేశంలోని ఇతర ప్రాంతాలలాగ ఆంధ్రదేశంలోకూడా అది మధ్యయుగపు చరమదశ. నిజంగానే అది "కారుచీకట్ల నీలినీడల కాళరాత్రి."

వేమన కవితలో స్థూలంగా ప్రతిబింబించే ఆనాటి మతపరిస్థితిని చూద్దాం: వేమన స్వీకరించిన వీరశైవమతం తన విప్లవ ధోరణిని, సంస్కారశీలతను

కోల్పోయి అప్పటికే చప్పబడింది. వేమన కాలంలోని వీరశైవమతంలో విప్లవ భావాలు కాని, సంస్కార చర్యలు కాని లేవు. 12వ శతాబ్దిలో కర్ణాటక దేశస్థుడైన బసవన ప్రబోధించిన వీరశైవం బహుభార్యాత్వాన్ని నిషేధిస్తుంది. వేదాలు విధించిన కర్మకాండను ప్రతిఘటిస్తుంది; పూజారుల దురాగతాలను నిరసిస్తుంది; వర్ణభేధాలను దూషిస్తుంది. స్త్రీపురుషుల మధ్య అసమానతలు పరిహరిస్తుంది. అంటరానితనాన్ని ఖండిస్తుంది. కఠోర నియమాలను నిరసిస్తుంది. వీరశైవమతంలోని బోధనలన్నీ నిషేధాలు మాత్రమే కావు అందులోను అభ్యుదయ భావాలున్నవి. అనుభవ పూర్వకమైన జ్ఞానం, అనుభూతితో కూడిన విశ్వాసం. వర్ణాంతర వివాహాల వల్ల రూపొందే సమసమాజం, నిష్కల్మషమైన కుటుంబ జీవనం, శ్రామిక జీవనం పట్ల గౌరవం, నైతిక విలువల అభివృద్ధి యందాసక్తి. మానవతా భావాలు కలిగి సర్వమానవ సౌభ్రాతృత్వానికి పాటు పడుతుంది. బసవన ప్రబోధించిన వీరశైవమతాన్ని ఆంధ్ర దేశంలో శ్రీపతి పండితుడు మొదట ప్రచారం చేశాడు. మల్లికార్జునుడు, పాల్కురికి సోమన ప్రభృతులు దాని వ్యాప్తికి కారకులు. ఈ మతం ఆంధ్రదేశంలో అతి వేగంగా వ్యాపించింది. సమాజంలో అట్టడుగున వున్న అంటరాని వారు, అగ్ర స్థానంలో వున్న బ్రాహ్మణులు అన్ని వర్ణాలవారు ఈ మతాన్ని స్వీకరించారు. అదొక నవోదయం. అభ్యుదయ భావాల కేంద్రమై ప్రబలమైన సంఘ సంస్కరణోద్యమ వ్యాప్తికి కారణమైంది.

కాలక్రమంలో వీరశైవమతం తొలి ఆదర్శాలను కోలుపోయింది. వేమన కాలానికి దాని నిజస్వరూపం అంతరించింది. దాని వికృత రూపం మాత్రమే మిగిలింది. సమాజంలో తరతమ విభేదాలను రూపుమాపాలన్న లక్ష్యాన్ని సాధించడంలో విఫలమయింది. అప్పటికే శాఖోపశాఖలుగ చీలి వున్న హిందూ సమాజంలో వీరశైవమన్న మరొక శాఖను సృష్టించింది. ఈ వీరశైవం వలన అదనంగా మరో రెండు శాఖలు ఏర్పడ్డాయి. వీరశైవుల్లో బ్రాహ్మణులు ఆరాధ్యశైవులుగా, బ్రాహ్మణేతరులు జంగమశైవులుగా విడిపోయారు. అంతే కాకుండ దీని వల్ల కొత్త కొత్త ఆచారాలు, అప్రస్తుతమైన గాథలు పురాణాలు, మరికొన్ని మూఢాచారాలు పుట్టుకొచ్చాయి. నూతనంగా మరొక పూజారుల వర్గం ఏర్పడింది. ఈ మతంలో పరమార్థం కన్నా బాహ్యాచారాలకే ప్రాధాన్యం కలిగింది. లింగధారణ చేసి, విభూదిని ధరించి, ప్రతి రోజు నియమిత సమయాలలో శివనామాన్ని స్మరించి పర్వదినాలలో ఉపవాసముండి, పుణ్య

క్షేత్రాలను సందర్శించితే భక్తుడు తన విద్యుక్తకర్మని చక్కగా నిర్వహించినట్లు పరిగణింపబడేది. దీన్ని బట్టి మతం అంటే వ్యవస్థీకరింపబడిన వేషధారణ అని ఒక్క మాటలో నిర్వచింపవచ్చు. ఇలా దిగజారిన పరిస్థితుల్ని సహించని వేమన :

ఆ॥ ఆత్మశుద్ధిలేని యాచారమదియేల
భాండశుద్ధిలేని పాకమేల
చిత్తశుద్ధిలేని శివపూజలేలరా ॥ విశ్వ ॥ (బ్రౌన్. 1839. 1-3)

అంటూ సర్వమత సహనాన్ని, అంతరి నమ్మకాల. విశ్వాసాల పట్ల సమభావాన్ని ప్రబోధించాడు.

ఆ॥ కుండకుంభమన్న గొండపర్వతమన్న
నుప్పులవణమన్న నొకటిగాదె
భాషలిట్టివేరు పరతత్త్వమొక్కటే ॥ విశ్వ ॥
(బ్రౌన్. 1839. 59-392)

తోటి వీరశైవులు తన విజ్ఞాపనల్ని పెడచెవిని పెట్టినట్లు గ్రహించిన వేమన ఉగ్రుడై ఇలా అన్నాడు.

ఆ॥ అఖిమతములందు నధికమైన మతంబు
లింగమతము కన్న లేదు భువిని
లింగధార్ల కన్న దొంగలు లేరయా ॥ విశ్వ ॥
(వావిళ్ళ. పుట. 22)

వైష్ణవమని వ్యవహరింపబడే శాఖ కూడా మౌలికమైన మార్పులతో ఉన్నత ఆదర్శాలతోనే ప్రారంభింపబడిన ఉద్యమమే. అయితే వేమన కాలానికి అది కూడా తన ప్రాథమిక ప్రభావాన్ని కోల్పోయింది. దానిలోనే అంతశ్శాఖలు ప్రబలి దాని పతనానికి దారి తీశాయి. తెంగలులు, వడగలులు విష్ణుభక్తులే అయినా ఒకరి నొకరు బద్ధశత్రువులుగా భావించి ద్వేషించుకొనడమే దీనికి నిదర్శనం. వేమన కాలంలో లేదు కాని ఆ తరువాతి కాలంలో ఈ రెండు శాఖల మధ్య వివాదానికి కారణం నొసటను ధరించే నామమని బ్రౌన్ వ్రాతలను బట్టి వ్యక్తమవుతున్నది. వైష్ణవ మతంలో శాఖాభేదాల్ని సూచించే ఈ నామం ఏ రూపంలో ఉండాలని వాదోపవాదాలు

జరిగాయి. ఈ వివాదాలు విద్వేషంగా మారి "అల్లర్లు చెలరేగి ప్రాణనష్టం కలిగి" నట్లు బ్రౌన్ పేర్కొన్నాడు

శైవ వైష్ణవుల మధ్య చెలరేగిన మత కలహాలు ఇంకా ఘోరమైనవి. కొన్ని కొన్ని సందర్భాలలో శైవులకు వైష్ణవులకు మధ్య యుద్ధాలు కూడా సంక్రమించి మానవ మారణ హోమానికి దారి తీసాయి. ఈ యుద్ధాలు లేని సమయాలు ఉద్రేక పూరితంగా వుండేవి. వాస్తవానికవి తాత్కాలిక యుద్ధ విరమణకాలాలు మాత్రమే. ఒక వైష్ణవుడు ఒక శైవుని తాకితే వెంటనే శుచిస్నానం చేయాలన్నది నమ్మశక్యం కానిదే అయినా అది పరమసత్యం. అలాగే వైష్ణవుని స్పర్శశైవుని అపవిత్రం చేస్తుంది. ఈ మూర్ఖత్వానికి విస్తుపోయిన వేమన :

ఆ॥ విష్ణుభక్తులెల్ల వెలిబూదిపాలైరి
వాదమేల? మత విభేదమేల?
తెలియలింగధరులు తిరుమణిపాలైరి ॥ విశ్వ ॥

(బ్రౌన్ 1839. 128-451)

అని ప్రశ్నిస్తాడు. ఇంకొక అడుగు ముందుకు వెళ్ళి ఇలా అంటాడు :

ఆ॥ మతము లెన్నియైన సతములు కావని
సతము కర్తమగును జగతియందు
నన్నిమతములందు నరయ నొక్కటిలేదు ॥ విశ్వ ॥

(బ్రౌన్. 1839. 115-359)

మతోన్మాదులతో వాదించడం నిష్ఫలమని భావించిన వేమన దొంగ భక్తుల బారి నుండి తప్పించుకోమని ప్రజల్ని హెచ్చరించాడు.

ఆ॥ మతపు వేషధార్లు మరిమహిమీఁదఁ బదివేలు
మూఢజనులఁ గలపమూగుచుంద్రు
కొంగలు గుమిగూడి కొఱకవా బోదెలు ॥ విశ్వ ॥

(వావిళ్ళ. పు. 32)

శైవ, వైష్ణవ మతాల ప్రాబల్యం తగ్గిపోగానే. మరల వైదిక కర్మకాండ, బలులు, సమాజంలో చోటు చేసుకున్నాయి. పూర్వంలాగ విరివిగా కాకపోయినా తరచు

బలులర్పించడం జరిగేది. సమాజంలో ప్రబలుతున్న యీ ఆచారాన్ని గర్హిస్తూ వేమన నిర్మొహమాటంగా ప్రశ్నించాడు :

సోమయాజి ననుచు సొంపుతో వేషంబు
గట్టి మాంసమెల్ల నాల్చి తినును,
ద్విజుడనేననగ నధికమేమి తన వల్ల ॥ విశ్వ ॥
(బ్రౌన్. 1839. 3-168)

అంతటితో తృప్తిపడక మరల ఇలా విమర్శించాడు :

పేరు సోమయాజి పెనుసింహబలుడాయె
మేకపోతుఁ బట్టి మెడను విఱువఁ
గాక క్రతువు వలనఁ గలుగునా మోక్షంబు ॥ విశ్వ ॥
(బ్రౌన్. 1839 . 125-428)

మరొక చోట "ఒక సత్కార్యం నిమిత్తం స్వార్థత్యాగం కన్నా ఉత్తమమైన బలిదానం ఏమున్నది?" అని నిలదీస్తాడు. యజ్ఞయాగాదుల ఫలం స్వర్గంలో రంభాది అప్సరసల పొత్తు అని ప్రజల నమ్మిక.

ఆ॥ సోమయాజి బట్టి సొడ్ల ప్రేసెను రంభ
యొంటె సోమయాజి నొంగబెట్టి
క్రతువు జేయు ఫలము కల్గెరా చేజేత ॥ విశ్వ ॥
(బ్రౌన్. 1839. 2-259)

ఈ మూఢ నమ్మకాన్ని వేమన ఇలా విమర్శించాడు తండ్రి కొడుకు లిద్దరు బలి నర్పిస్తే, ఇద్దరూ స్వర్గానికి వెళ్తారు. ఇద్దరికి రంభ సంపర్కం లభిస్తుంది. అప్పుడు వాళ్ళిద్దరూ వావివరుసలు తప్పి పాపం చేయడం లేదా?

ఆ॥ తల్లితో రమించె తండ్రి యజ్ఞము చేసి
తనయుడట్టె రంభ దనరగూడె
తల్లిని రమియింత్రు దబ్బర విప్రులు ॥ విశ్వ ॥ (వే. వే 63)

అని ఎత్తి పొడిచాడు. ఇలా అనేక ఆచారాల్ని, నమ్మకాల్ని వేమన తరచూ దుయ్యబట్టడం చూస్తే, ఈ మత మౌఢ్యం వేమన కాలంలో ఎంతగా దిగజారిపోయిందో తెలుస్తుంది.

ఆ నాటి సాంఘిక, రాజకీయ పరిస్థితులు కూడా అధ్వాన్నంగానే ఉండినాయి- కేంద్రీకృతమైన రాజ్యాధికారం లేదు. పిల్ల జమీందారీలు. పిల్ల పెత్తనదారులు. ఈ పాలకులు బలహీనులు. ఏ ఆకతాయి వాడయినా వారిని ఎదిరించి, శిక్షింప సమర్థుడని వేమన పేర్కొన్నాడు. శక్తిహీనులైన రాజులలాగా ఈ పిల్ల జమీందారులు కూడ చపలచిత్తులు. చీటికి మాటికి చిరాకు పడేవారు. భట్రాజులు వారిని పరివేష్టించి వుండే వారు. ముఖస్తుతికి ఉబ్బొంగేవారు. పొగడ్తలతో పొట్ట నింపుకునేవారు. సుఖభోగా లతో తేలియాడేవారు. ప్రజలు తమపై తిరుగుబాటు చేయరన్న ధీమాతో వారిని పీడించేవారు. అటువంటి ఒక రాజును గూర్చి వేమన ఇలా ప్రస్తావించాడు.

ఆ॥ దుండగీఁడు కొడుకు కొండీఁడు చెలికాడు
బండరాజునకును బడుగుమంత్రి
కొండముచ్చునకును గోఁతియెసరియగు ॥ విశ్వ ॥

(బ్రౌన్. 1839. 152-149)

మరొక పద్యం చిత్తగించండి.

ఆ॥ అల్పబుద్ధి వాని కధికార మిచ్చిన
దొడ్డవారి నెల్లఁ దొలఁగఁగొట్టు
చెప్పుఁదినెడు కుక్క చెఱకు తీపెఱుఁగునా ॥ విశ్వ ॥

(బ్రౌన్. 1839. 64-8)

పైగా రాజులతోడి స్నేహం త్రాచుపాముతోడి చెలిమివంటిదని కూడా హెచ్చరిస్తాడు

ఆ॥ ఎంత సేవఁజేసి యేపాటు పడినను
రాచమూక నమ్మరాదురన్న
పాముతోడి పొందు పదివేలకైనను ॥ విశ్వ ॥

(బ్రౌన్. 1839. 74-82)

ఇటువంటి అసమర్థులు, దుర్మార్గులైన పాలకుల దుష్పాలనలో ప్రాణాలకు ఆస్తులకు భద్రత ఉండదు. దోపిడీదారులు దేశాన్ని కొల్లగొడతారు. వారి నుద్దేశించి వేమన ఇలా అన్నాడు :

ఆ॥ పెక్కు జనులఁ గొట్టి పేదల వధియించి
సొక్కు కొంచు నూళ్ళ దొంగిలించి
మెక్కుడి కరిగిన మెఱింగి యముఁడు చంపు ॥ విశ్వ ॥

(బ్రౌన్. 1839. 86-161)

కఠినాత్ములు, కర్కశులు, అయిన నేరస్థుల ప్రళయం. యమదండన వంటి వాటికి బెదిరి తమ దొంగతనాలను, దోపిడీలను మానరు. వారానందంతో ప్రజలను పీడించి హాని కలిగిస్తుంటారు. అరాజకం పెచ్చరేగి శాంతి భద్రతలు సన్నగిల్లినప్పుడు తటస్థించే అన్ని విపత్తులతో పాటు తరచు కరవు కాటకాలు, అంటురోగాలు సంక్రమించి ప్రజాజీవనం దుర్భరమవుతుంది. కళలు, పరిశ్రమలే కాక, విద్యకూడా సన్నగిల్లుతుంది. అందుకే వేమన అన్నాడు :

ఆ॥ గ్రాసమింత లేక కడుగష్టపడుచున్న
విద్యయేల నిలచు వెడలుగాక
పచ్చికుండ నీళ్ళు పట్టిన నిలుచునా ॥ విశ్వ ॥

(వావిళ్ళ. షట. 9)

అటువంటి అంధకారమైన క్షీణయుగంలో జన్మించి, ఆ కాలపుదుర్నీతిని ఏకాకిగ ఎదిరించాడు వేమన. ఇది వేమన సంస్కరణ నిరతికి నిదర్శనం. వేమన స్వరం కఠినంగ, వాక్పరుషంగ, విమర్శకర్కశంగ ఉన్నందున అతడు కఠిన స్వభావుడని అపార్థం చేసుకోకూడదు. వేమన సాధుస్వభావుడు; అనురాగపూరితుడు; సహనశీలి. పిచ్చివాడు, వేషధారి అన్న అవహేళనలను లక్ష్యపెట్టని వేమన సున్నిత హృదయం ఆక్రోశించి తన సమకాలీన సమాజంలోని కుళ్ళును ఎత్తిచూపింది. దూషణల్ని భూషణాలుగ స్వీకరించి ముందు చూపుతో, ప్రగతి పథంలో నడిచాడు. భారతదేశపు మధ్యయుగాలకు చెందిన దార్శనిక కవులలో బహుశః వేమనే కట్టకడపటివాడు కావచ్చు. అయితే వేమన నిశ్చయంగా వారందరిలో ఒక గొప్ప కవి.

# కవి ఉవాచ

తళుక్కున తట్టిన తలపును, చటుక్కున చెప్పాడు కవి.

—ఎమెర్సన్.

ఇప్పటికీ తెలుగు కవి సమ్రాట్టులు వేమనను ఒక కవిగ అంగీకరించారు; కాని మహాకవిగామాత్రంకాదు. వారు వేమనను ఒక శతక కవిగామాత్రమే గుర్తించారు. వేమన పద్యాలు శతక ప్రక్రియకు చెందినవన్నది వాస్తవమే. ఆ పద్యాలన్నింటికి మకుటం ఒక్కటే. కొన్నిపద్యాలలో మకుటం మారినా ఆ మార్పు చాల స్వల్పమైనది. పద్యస్వరూపాన్నికాకుండ అందలి భావాన్ని గ్రహించినట్లయితే హంసకు, కొంగలకు ఉన్నంత భేదం వేమనకు, శతక కవులకు ఉన్నది. శతక కవులు శతాధికంగ ఉన్నారు. వారిలో అధిక సంఖ్యాకులు స్తోత్రపాఠకులు. తమ ఇష్టదైవాన్నిగూర్చి, అభిమాన కృతిభర్తను గూర్చిస్తోత్రాలు చేశారు. నీత్యుపదేశాలతో కూడిన వారి శతకాలలోని నీతులు కాపీ పుస్తకాలలోని నీతులస్థాయిని అధిగమించవు. వారి భావాలు గంభీరమైనవి కావు. అవి నిస్సారమైనవి. వారి శైలి సామాన్యమైనది. వారి కవిత శుష్కమైనది. వేమనవి స్వతంత్ర భావాలు. వేమన సునిశితమైన ప్రకృతి పరిశీలకుడు. సహజంగ తీవ్రభావావేశపరుడు. మనస్సుకు హత్తుకునే ఆలోచనలు కలవాడు. చెప్పదలంచిన దానిని నిస్సంకోచంగ చెప్పుతాడు. అట్టి వేమనను శతక కవిగ పరిగణించడం అన్యాయం. పి. చెంచయ్య, రాజా యం. భుజంగరావు ఇంగ్లీషులో వ్రాసిన ఆంధ్రవాఙ్మయ చరిత్రలో వేమనను "శతక కవిరాజు" అని ప్రశంసించడంకూడ వేమనకు న్యాయాన్ని చేకూర్చదు. ఈ గ్రంథానికే మున్నుడి వ్రాసిన డా॥ పి. ఆర్. రెడ్డి, వేమనను "తారకలలో ధ్రువతార"గ పేర్కొనడం చాల సముచితం. పురాణాలను ప్రబంధాలను రచించకపోయినా వేమనను సాంప్రదాయిక కవిగ పరిగణింపవచ్చు. అతని కవిత సాంప్రదాయికమైనది. "A History of English Literature" అన్న గ్రంథాన్ని రచించిన జంట రచయితల్లో ఒకరైన కజమియన్ (Cazamin) ఒకచోట రాబర్ట్ బర్న్స్ (Robert Burns) గురించి పేర్కొన్న మాటల్ని అన్వయించుకుంటే "అత్యుత్తమ సాంప్రదాయికతను" వేమన సాధించాడని చెప్పవచ్చు, కజమియన్ బర్న్స్ గురించి

ఇలా అన్నారు: "సహృదయతతో పరిశీలించితే బర్న్స్ కృతి ఉత్తమ సాంప్రదాయిక కోవకు చెందుతుంది. భావనలో, సిద్ధాంతంలో ఈ సంప్రదాయం స్వతంత్రమైనది; స్వయం సమృద్ధమైనది." బర్న్స్ లా వేమనకూడ గ్రామీణుడు. ఆ ఆంగ్లేయ కవిలా ప్రతిభావ్యుత్పత్తులు కలిగి తన సొంత "స్వయం సమృద్ధమైన ఉదాత్త సంప్రదాయాన్ని" సృష్టించాడు.

వేమన గంటంపుచ్చుకొని తాటాకులమీద కవితను వ్రాయలేదు. ఆశువుగ చెప్పాడు. వర్డ్స్‌వర్త్ (Wordsworth) కవిత్వంలాగ వేమన కవిత్వం ప్రశాంత వాతావరణంలో నెమరువేసుకున్న భావాలుకావు. భావోద్వేగం పొంగి పొరలిన గడియలలో ఆవిర్భవించిన కవిత వేమనది. విశ్వాసాలకు అంకితమైనవాడు కనుక వేమన తన భావావేశాన్ని అణగారనిచ్చేవాడుకాడు. కర్తవ్యనిర్వహణలో తన పాత్ర కవి పాత్రకాదని, ఒక దార్శనికుని పాత్ర అని వేమన నిర్ణయించుకున్నాడు. అందువల్ల వేమన కవిత్వ లక్షణాలకు ప్రాధాన్యత నీయలేదు. రస సిద్ధాంతంలో ప్రసిద్ధులైన భరతుడు, దండి, అభినవగుప్తుడు, హేమచంద్రుడు, భోజుడు మున్నగు వారిని గురించి వేమన కనీసం వినికూడ ఉండడు. అయినా వేమన తన హృదయాన్నికలచే భావాలను కవితారూపంలో వెల్లడించకుండా ఉండలేకపోయాడు. కారణం అతడు పుట్టుకవి: వేమనది ఉదాత్త కవిత్వం. అందుచేత వేమన కవిత్వం ఒకప్పుడు వరదలా ఉప్పొంగుతుంది; అగ్నిపర్వతంలా బ్రద్దలవుతుంది; తుఫానులా సముద్రాలను సుళ్ళుత్రిప్పుతుంది; మరొకప్పుడు మండువేసవి తరువాతి చల్లనిజల్లులా, మలయ మారుతంలా, ఉషోదయపు పక్షుల కలకూజితంలా అతిత్వరితగతిని మారుతుంటుంది.

1950. వ. సంవత్సరం ఆకాశవాణి మదరాసు కేంద్రంనుండి ప్రసారమైన ఆంగ్ల ప్రసంగంలో డా॥ కట్టమంచి రామలింగారెడ్డిగారు వేమనను గురించి ఇలా ప్రస్తావించారు: "వేమన ప్రకృతి కవి. సహజకవికూడ" అని చాటారు. వారి ప్రసంగంనుండి మరికొన్ని వాక్యాలను అనువదించి ఉటంకించవచ్చు: "వేమన విద్యాధికుడు, పండితుడూకాడు. కాని జీవితాన్ని, ఆధ్యాత్మిక, భౌతిక సమస్యల్ని తరచిచూచి అందలి సత్యాలను పునరాలోచించే మహామనీషి. ఆయన కవిత్వం స్వచ్ఛమైన చలమ. శైలిలో, భావనలో స్వతంత్రమైనది. అప్రయత్నంగా పెల్లుబికేది. పాదత్రయంలోనే పద్యసారాన్నంతా ఇముడ్చుతాడు. సంక్షిప్తత వ్యంగ్యానికి

హృదయమయితే ప్రపంచంలో ఇంతకు మించిన వ్యంగ్యంలేదు. అతని ఉత్ప్రేక్షలు ఉపమానాలు అన్నీ పల్లెదృశ్యాలనుండి, గ్రామీణ వాతావరణంనుండి, పొలాలనుండి, వనాలనుండి గ్రహింపబడ్డాయి. వేమన ప్రకృతి కవి; సహజకవికూడ."

వేమన భావాలను ఏవగించుకునే వారు సహితం అతని విశిష్ట కవితా మాధుర్యానికి ముగ్ధులు కాక తప్పదు. వేమన కవిత సరళంగ వున్నా నీరసమైనది కాదు. మధురంగ వున్నా వెగటు కలిగించదు. ప్రజారంజకమైన ఉపన్యాసాలలోని ప్రౌఢిమ వైవిధ్యం దానికున్నాయి ప్రథమ ప్రకరణంలో పేర్కొన్నట్లు ఇట్టి కవితలో వేమన సిద్ధహస్తుడు, వేమన కవితలో కొంత అస్పష్టత లేకపోలేదు. అయితే ఆయన తాత్త్వికానుభవాల్ని చిత్రించేటప్పుడు మాత్రమే యీ అస్పష్టత ద్యోతకమవుతుంది. వాటి స్వరూప స్వభావాల్ని బట్టి చూస్తే యీ దార్శనికానుభవాలు వ్యక్తిగతమైనవి. కొందరీ అనుభవాలను నమ్ముతారు; కొందరు నమ్మరు. విశ్వసించేవారికవి పరమ సత్యాలు. వారికి వాటి వివరణ అనవసరము. నమ్మని వారికవి అవాస్తవాలు, ఊహాతీతాలు. హిందువులైనా, క్రైస్తవులైనా, సూఫీలయినా ఎవరైనప్పటికి దార్శనికులందరు ప్రతీకాల సాయం లేకుండా తమ తాత్త్వికానుభవాల నిజస్వరూపాన్ని ఇతరులకు వివరించలేరు. ఇతర దార్శనికుల్లాగ వేమన కూడ తన సొంత ప్రతీకల్ని ఉపయోగిస్తాడు. "నిద్రానంతర నిద్ర; జ్ఞానాతీతజ్ఞానం; స్థలాంతరస్థలం: దృశ్యం లోని దృశ్యం; తెరమరుగున జ్యోతి, దేహంలోని ఆత్మ; ఆత్మలోని దేహం." వంటివి వేమన ప్రయోగించిన ప్రతీకల్లో కొన్ని. వేమన తత్త్వాలు సామాన్యులకగమ్య గోచరంగ, గూఢంగ, గుప్తంగ తోచవచ్చు. కాని సర్రియలిజం సమ్మిళితమైన కవితకన్న, అమూర్తమైన ఆధునిక చిత్రకళకన్న అది గూఢమేమీ కాదు. కొన్ని అంశాలు సూచింపదగినవే కాని వివరింపదగినవి కావు. ఈ సత్యాన్ని గ్రహింపని కొందరు వేమన అనుయాయులు వివరింపలేని వాటిని వివరింప ప్రయత్నించి నవ్వుల పాలవుతారు.

వేమన ఆటవెలది ఛందస్సును తన కవితా వాహికగ ఎంచుకున్నాడు. ఆయన మేధకు ఆటవెలదికి చక్కని పొంతన కుదిరింది. ఈ ఆటవెలది వేమన కల్పితం కాదు. అది చాల ప్రాచీనమైన దేశిచ్ఛందస్సు. ఆటవెలది అన్న పదానికి అర్థం "ఆడు నటువంటి ఆడది". నన్నయ నుండి శతాధిక కవులు ఆటవెలదిని ఉపయోగించారు. కాని వేమన ఘంటంలో అద్వితీయంగ అది ఒదిగిపోయినట్లు మరింకెవ్వరి గంటం

లోను కుదుకుకోలేదు. కాళిదాసునికి మంద్రాక్రాంతలాగ, భవభూతికి శిఖరిణిలాగ, తిక్కనకు కందపద్యంలాగ, శ్రీనాథునికి సీసంలాగ వేమనకు ఆటవెలది అనుకూల మైంది. ఆంగ్ల వాఙ్మయం నుండి కూడ రెండు సాదృశ్యాలను చూపవచ్చు. పోప్‌కవి హిరోయిక్ (Heroic) ద్విపదతతో, షేక్స్‌పియర్ బ్లాంక్‌వర్స్‌తో చేసినట్లు వేమన ఆటవెలదులతో పాఠకుల్ని మంత్రముగ్ధుల్ని చేశాడు. హిరోయిక్ కప్లెట్ ఛందస్సును గురించి ప్రస్తావిస్తూ లిట్టన్ స్ట్రాచే (Lytton Strachey) ఇలా అన్నాడు : "ఈ ఛందస్సుకు పోప్ హస్తాలలో పరిపూర్ణత సిద్ధించింది." అలాగే వేమన చేతుల్లో ఆట వెలది సర్వాంగ సుందరంగ రూపొందింది. వేమనకు పూర్వం ఏ తెలుగు కవి కూడ ఆటవెలదిలోని సరళతనుగాని, లయనుగాని సంపూర్ణంగ గుర్తించి సద్వినియోగపరచ లేదు.

వేమన పద్యసంకలనాలలో ఆటవెలదులే కాక తదితర ఛందస్సుల్లో సంత రించిన వృత్తాలు కూడ వున్నాయి. అయితే అవి పరిగణించదగిన సంఖ్యలో లేవు. వేమన కవితా సహజలక్షణాలైన సరళత, సూటిదనం వ్యంగ్యం ఆపద్యాలలో లోపించింది. ఆ వృత్తాలు ప్రక్షిప్తాలన్న రాళ్ళపల్లివారి అభిప్రాయం సరియైనదే.

వేమన ఆటవెలదిని మలచిన తీరును డా॥ జి. వి. కృష్ణారావు చాల చక్కగ సమన్వయించి చెప్పారు. "సామాన్యంగ ఆటవెలదిలోని మొదటి రెండు పాదాలలో వేమన తాను చెప్పదలచిన విషయాన్ని కుదిస్తాడు. ఆ విషయం మనస్సుకు హత్తు కునేలా మూడవ పాదంలో ఒక అత్యద్భుత సామ్యాన్నో, ఉపమనో జోడిస్తాడు. చతుర్థపాదం ఆలంకారికమైన మకుటం మాత్రమే. ఈ వివరణను బట్టి వేమన ఆట వెలది అందమంతా ఆ తృతీయపాదంలోని ఉపమపై ఆధారపడి వున్నదన్నది సువిది తం. గురి చూచేవాడు అప్పుడప్పుడు గురి తప్పవచ్చు. కాని వేమన మాత్రం తన ఉపమలో తప్పడు. వేమన కవితా నైపుణ్యం, వైభవం చాలవరకీ సామ్యాల ప్రయో గంపై ఆధారపడి వున్నది. ఈ ఉపమలు వేమన హస్తాలలో నవ్యతను, నాణ్యతను సంతరించుకొన్నాయి. తరచు ఈ ఉపమలు, సూక్తుల రూపంలో వుండి పాఠకుల్ని ఆశ్చర్యచకితుల్ని చేస్తాయి, ఉపమలకు కాళిదాసు ప్రసిద్ధుడయితే, సామ్యాలకు వేమన సుప్రసిద్ధుడు." [1]

---

1. డా॥ జి. వి. కృష్ణారావుగారి అభిప్రాయాల్ని ఉద్ధరించడంలో చిరుమార్పులు చేయబడ్డాయి. అయితే అవి మూలంలోని అర్థానికి భంగం కలిగించటంలేదు–గ్రంథకర్త

వేమన తన ప్రతి పద్యంలోను నియతంగ ఒక సామ్యాన్నో, సూక్తినో చెప్పకపోయినా విశ్చయంగ అనేక పద్యాలలో చెప్పాడనడంలో విప్రతిపత్తిలేదు. ఈ అభిప్రాయంతో డా॥ జి. వి కృష్ణారావు కూడ ఏకీభవిస్తున్నారు. అయితే వేమన పద్య పరిశీలన వలన వదిహేను శాతం పద్యాలలో మాత్రమే సామ్యాలున్నట్లు లెక్కలు తేలాయి. వీటిలో కూడ కొన్ని చిరుమార్పులతోటి పునరుక్తులు. మరి కొన్ని యే మార్పులు లేకుండానే పునరుక్తులు. వేమన ఏవగించుకొనే కుక్క, గాడిద యీ సామ్యాలలో అధిక భాగం చోటు చేసుకున్నాయి. వేమన యీ సామ్యాలను ఎంతో అద్భుతంగ, అతికినట్లు ఉపయోగించడం వల్ల వాటిని ఆయన ప్రతి పద్యంలో ప్రయోగించాడన్న భావన కలుగుతుంది. వేమన పద్య రచనా ప్రణాళికను గురించి మరొక మాట కూడ చెప్పవచ్చు. ప్రబోధాత్మక పద్ధతిలో వేమన సిద్ధహస్తుడనడం వాస్తవం. ఇంచు మించు వేమన పద్యాలన్నింటిలో ప్రథమ పాదంలో ఒక సిద్ధాంత ప్రతి పాదన, ద్వితీయ పాదంలో తద్భిన్నమైన వ్యతిరేక ప్రతిపాదన, తృతీయ పాదంలో ఈ విరుద్ధ విషయ సమ్మేళనం వుంటుందన్న కొందరి అభిప్రాయం సరి కాదు. ఈ పద్ధతిని అనుసరించిన పద్యాలు నూటికన్న తక్కువ వుంటవి.

వేమన పద్యాలలో తృతీయపాదం ప్రశ్నరూపంలో ఉన్న వానిని కొన్నింటి నిక్కడ ఉద్ధరిస్తాము :

చెంత దీపముడక చీకటి వాయునా? (వావిళ్ళ. పుట. 54)
కుక్కతోక బట్టి గోదావరీదునా? (బ్రౌన్. 1839. 82_133)
ఏమఁగు పడియున్న ఎత్తునామశకంబు?
బొగ్గుపాలఁగడుగఁ బోవునా నైల్యంబు? (వావిళ్ళ. పుట. 89)
కాలఁకు లెండినంతఁ గొక్కెరలుండునా? ( " " 164)
కొలన యెండిపోవ గొక్కెరలుండునా? ( " " 67)
చిన్నచేతి దివ్వె పెద్దగా వెలుఁగదా? ( " " 15)
దూడ వగచునె భువి తోడేలు నచ్చిన? ( " " 79)
కొంకి వక్క జావ గొర్రెలేమిటి కేడ్చు?
కుక్క తోఁక గట్ట గుదురునా చక్కగా? (బ్రౌన్ 1839. 106-303)

కొయ్యబొమ్మ దెబ్బ కొట్టితే గుణియౌనె?
పరిమళముల గర్దభము మోయ ఘనమౌనె? (బ్రౌన్. 1839. 78.107)
మొదల విడిచి గోడతుది బెట్ట గల్గునా? ( " " 75- 88)
కంచు మ్రోగునట్లు కనకంబు మ్రోగునా? ( " " 5- 30)
కొండ యద్దమందు కొంచెమైయుండదా? ( " " 4- 21)
కుక్క సింహమగునె గోదావరికి బోవ? ( " " 167-253)
పంది బురదమెచ్చు పన్నీరు మెచ్చునా?
ఎనుము గొప్పదైన నేనుఁగుఁ బోలునా? ( " " 81-131)
సతులు జపతపములు సల్పఁగ సాగినఁ
బురుషులేల నిఁకమ బుడమిలోన? (వావిళ్ళ. పుట. 36)
అమృతపు రుచులను హస్తమెఱ్ఱుఁగును?
విత్తనంబు మఱ్ఱివృక్షంబునకు నెంత? (బ్రౌన్. 1839. 11-67)
తలలు బోడులైన తలఁపులు బోడులా?

ఇవి, ఇంకా ఇటువంటి వేమన పద్యాలలోని తృతీయపాదసామ్యాలు తెలుగు సామెతెలుగ చెలామణి అవుతున్నాయి.

వేమన కవితకు పుష్టిని కలిగించిన లక్షణాలలో పుష్కలమైన హాస్యమొకటి. గాంధీగారొకమారిలా అన్నారు : "నాలో హాస్యదృక్పథమే లేకపోతే నేనేనాడో ఆత్మహత్య చేసుకొని ఉండేవాడిని." ఈ మాటలనే వేమన కూడ చెప్పివుండేవాడు. పరిహసించి. నవ్వేశక్తే వేమనకు లేకపోయినట్లయితే, ఉన్నత లక్ష్యాన్ని సాధించడంలో నిమగ్నుడైన ఆయన కూడ ఆత్మహత్యకు పాల్పడేవాడే. ఈ హాస్య రసం వేమన కవితకు మరొక కోణాన్ని సమకూర్చింది. వేమన పరిహాసానికి గురి అయిన వారిలో లోభులు ప్రథములు :

ఆ॥ లోభి వాని జంపలోకంబు లోపల
మందు వేఱు వలదు మతమె గలదు
పైకమడుగ నతఁడు భగ్గురుమని చచ్చు. ॥ విశ్వ ॥
(బ్రౌన్. 1839. 6-36)

మరొక చోటిలా ఎత్తి పొడిచాడు :

ఆ॥ పిసిని వాని యింట పీనుఁగు వెడలిన
గట్టి కోలలకును గాసు లిచ్చి
వెచ్చమాయె నంచు వెక్కి వెక్కి యేడ్చు. ॥ విశ్వ ॥
(బ్రౌన్. 1839. 6-34)

ఇంకొక పద్యంలో వారినిలా పరిహసించాడు :

ఆ॥ గొడ్డుటావుఁ బిదుకఁ గుండఁ జేకొని పోవ
పండ్లు రాలఁ దన్ను పాలనీదు
లోభివాని నడుగ లాభంబు లేదయా. ॥ విశ్వ ॥
(బ్రౌన్. 1839. 83-141)

ఏకాంత ప్రదేశాలలోనే నిజమైన దైవభక్తుల్ని సంధించవచ్చునని, ఆధ్యాత్మిక గురువులను దర్శించవచ్చుననే వారిని పరిహసిస్తూ :

ఆ॥ గుహల లోనఁ జొచ్చి గురువుల వెదకంగ
గ్రూరమృగ మొకండు తారసిలిన
ముక్తిదారి యదియె ముందుగాఁ జూపురా. ॥ విశ్వ ॥
(వావిళ్ళ. పుట. 234)

చార్లెస్ డికెన్స్‌ను గూర్చి చెప్పిన యీ మాటలు వేమనకు కూడ అన్వయిస్తవి : "అతని పరిహాసం కొంతవరకు ఉపదేశాత్మకమైనది." కేవలం నవ్వు పుట్టించడానికి మాత్రమే హాస్యోక్తుల్ని చెప్పక, అవి ఒక ప్రయోజనాన్ని ఆశించి చెప్పబడ్డాయి.

వేమన కవితా తూణీరంలో వ్యంగ్య పరిహాసం, వ్యాజస్తుతి అన్న మరి రెండు వాడియైన బాణాలున్నాయి. డా॥ సి. ఆర్. రెడ్డి ఇలా పేర్కొన్నారు : "హేతువుకు లొంగని మూఢ విశ్వాసాలను గురించి వాదించడం నిష్ప్రయోజనం అన్నది వాల్టేర్ సూక్తి. వేమనకు కూడ ఇట్టి భావనలో పరిపూర్ణ విశ్వాసమున్నది. కనుక వేమన వాదించడుగాని, గాయమయ్యేలా దెబ్బతీసి ఆ బూటకాల్ని పరిహాస

పాత్రం చేస్తారు." వేమన వ్యాజస్తుతికి, వ్యంగ్య పరిహాసానికి శతాధిక ఉదాహరణ లను చూపవచ్చు. బాహ్యాచారాలను ఆచరిస్తూ, ఆంతరంగిక పారిశుద్ధ్యం లేని వారిని విమర్శిస్తూ :

ఆ॥ భూతి దేహమందుఁ బూసిన నయ్యేనా
నిష్ఠ శివుని యందు నిలుపవలయు
గాక బూది యందు గాడిద పొరలదా? ॥ విశ్వ ॥

(బ్రౌన్. 1839. 156-172)

ఆ॥ నీళ్ళ మునుగువాఁడు నిర్మలాత్ముఁడు గాఁడు
పూర్ణమైన ముక్తిఁ బొంద లేఁడు
నీరుకోడి యెపుడు నీళ్ళను మున్గదా. ॥ విశ్వ ॥

(వావిళ్ళ. పుట. 215)

ఆ॥ ఆకులెల్ల దిన్న మేఁకపోతులకేల
కాకపోయెనయ్య కాయసిద్ధి
లోకులెల్ల వెట్టి పోకళ్ళఁ బోదురు. ॥ విశ్వ ॥

(బ్రౌన్. 1839. 156-173)

వేమన బాహ్యాచారాలను చాల కటువుగ విమర్శించాడు :

ఆ॥ సకల తీర్థములను సకల యజ్ఞంబుల
తలఁ గొరుగకున్న ఫలము గలదె
మంత్ర జలము కంటె మంగలి జలమెచ్చు. ॥ విశ్వ ॥

(వావిళ్ళ పుట. 36)

కుల విభేదాలలోని అర్థరాహిత్యాన్ని ఎత్తి పొడుస్తూ ఇలా ప్రశ్నించాడు : శూద్ర యువతి కొడుకు నిశ్చయంగ శూద్రుడే అయితే మరి వశిష్ఠుని సద్బ్రాహ్మణునిగ ఎలా పూజిస్తారు? ఊర్వశి అప్సరసే అయినా శూద్ర స్త్రీ. ఆమె పుత్రుడే కదా వశిష్ఠుడు?

తల్లి యూర్వశి యంజె తన యాలుమాదిగ
తాను బ్రాహ్మణుడనగ తగునె జగతి
వాసిష్ఠ కులమతి వసుధలో నెరుగరా. ॥ విశ్వ ॥

(ఆరుద్ర : మన వేమన, పుట. 148)

అంటరాని దాని మగడు కూడ అంటరాని వాడే అయితే వశిష్ఠుని చూచి ఎలా గర్వించగలరు? వశిష్ఠుని భార్య అంటరానిదైన అరుంధతి కాదా?

ఆ॥ మాదిగ యనఁగనె మతి తక్కువందురు
మాదిగ యిల సురల మామగాదె
మాదిగకును బిడ్డ మన యరుంధతిగదా. ॥ విశ్వ ॥

(వావిళ్ళ. పుట. 408)

హైందవులకు పరమ పవిత్రమైన పౌరాణికగాథలు కూడ వేమన విమర్శకు, అవహేళనకు గురి అయినాయి :

ఆ॥ పాల సంద్రమందు పవ్వళించిన వాఁడు
గొల్లపల్లె పాలు కోరనేల
యెదుటి వారి సొమ్ము యెంత తీపో కాని. ॥ విశ్వ ॥

(వావిళ్ళ. పుట. 71)

ఆ॥ కనక మృగము భువిని కద్దు లేదనలేక
తరుణి విడిచిపోడె దాశరథియు
దైవమైన తనము దలఁచుమందెను గాదె. ॥ విశ్వ ॥

(వావిళ్ళ. పు. 60)

ఆ॥ అగ్ని బాణమేసి యంబుధి నింకించి
రాముఁడ వలికే గరాక నిలిచి
చెట్లగిరుల దెచ్చి సేతువు గట్టఁడా. ॥ విశ్వ ॥

(వావిళ్ళ. పు. 312)

ఆ॥ విత్తమొకరికిచ్చి వితరణ గుణమును
జిత్తమొకరికిచ్చి చెఱచినాఁడు
బ్రహ్మచేఁత లన్ని పాడైన చేఁతలు, ॥ విశ్వ ॥

(వావిళ్ళ. పు. 126)

ఎట్టి దైవదుర్లలిత క్రీడ!

కట్టమంచి వారన్నట్లు వేమన శైలి "చురుక్కు మనిపించే వాడి దనం నుండి మృదువైన పరిహాసంగ, సరళమైన వ్యంగ్యంగ, తియ్యని హాస్యంగ దశల వారిగ మారుతుంటుంది". వేమన చర్చించిన విషయాలు అనేకానేకం. మానవునికి, మానవ సంక్షేమానికి సంబంధించినది ఏది కూడ ఆయనకు అల్పమైనది కాదు. గెతే (Goethe) ను ఉద్దేశించి మ్యాథ్యూ ఆర్నోల్డ్ (Mathew Arnold) ఇలా అన్నాడు: "బాధిత ప్రజానీకానికై పాటుపడ్డాడు; వారి ప్రతి గాయాన్నీ, ప్రతి బలహీనతను పరిశీలించాడు;

ఆ గాయాన్ని స్పృశించాడు.

"ఇక్కడ-ఇక్కడే నీకు బాధ" అని ఆక్రోశించాడు. వేమన కూడ గెతే లాగే ఆవేదన పడ్డాడు. వేమన మానవాళి వ్యథల్ని గుర్తించటమే కాక వాటికి పరిష్కారాన్ని కూడ సూచించాడు. మానవ సేవకు ఆయన సర్వదా సంసిద్ధుడు. ఆయన ఇంటింటికి, వాడవాడకు, పల్లె పల్లెకు తిరిగాడు. ప్రతి చోట తటస్థ పడిన ప్రతి వ్యక్తిని పలకరించాడు. సంధించిన వ్యక్తులకు ఆశువులుగ పద్యాలు వినిపించాడు. శాశ్వతంగ గ్రంథస్థం కావాలన్న ఉద్దేశంతో పద్యాలు చెప్పలేదు గనుక వేమన తన పద్యాలను పుస్తక రూపంలో పదిల పరచటానికి ప్రయత్నించలేదు. వేమనంటే అభిమానం, గౌరవం ఉన్న శిష్యులు కొందరు వాటిని వ్రాసి భద్రపరిచారు. వారు విద్యాధికులు కానందున తాళపత్రాలపై వారు వ్రాసిన వ్రాతల్లో కొన్ని దోషాలు దొరిలాయి. మూలప్రతిని చూచి మరికొన్ని ప్రతులను వ్రాసినపుడు మరి కొన్ని తప్పులు చేరాయి. కొందరు లేఖకులు ఒక పదమో, పాదమో అస్పష్టంగ వున్నప్పుడు తమ కవితతో ఆ పదాన్నో పాదాన్నో పూరించడం వలన వేమన కవితా రూపం ఇంక కొంత మారింది. ఇది చాలనట్లు ఆయన అభిమానులు, దురభిమానులు కూడ ప్రక్షిప్తాలను చేర్చారు.

బ్రౌన్ కాలం నుండి ఇప్పటి వరకు సామాన్య ప్రజానీకంలో ముఖస్థంగ ప్రచారంలో వున్నవి, కొత్తగ కనుగొన్న తాళపత్ర ప్రతులలోనివి అన్నీ కలిపి మూడు వేల వరకు వేమన పద్యాలు సేకరింపబడ్డాయి. వీటిలో ఎన్ని వేమన స్వయంగ చెప్పినవి అన్నది సందేహాస్పదం. బ్రౌన్ సేకరణలోనివి కూడ చాల వరకు ప్రక్షిప్తాలే. ఇప్పటి వరకు వేమన పద్యాలను గుర్తించి, వాటిని ఒక సంకలనంగ ప్రచురించే ప్రయత్నం జరగలేదు. బ్రౌన్ ప్రచురించిన సంకలనంలో మార్పు చేర్పులను మాత్రమే తరువాత ప్రచురణ కర్తలు చేశారు.

ఈ విషమ పరిస్థితిని చక్కబెట్ట వలసిన సమయం ఆసన్నమైంది. వేమన కృతాలుగతోచే ఆటవెలది, కందపద్యాలను మినహాయించి, తదితర వృత్తాలను పరిహరించి, వాటిలో కూడ పునరుక్తులలో మంచి వాటిని గ్రహించి, వేమన సిద్ధాంతాలకు వ్యతిరిక్తమైన వాటిని ప్రక్షిప్తాలుగ త్రోసి వేస్తే, శేషించిన పద్యాలు బహుశా రెండు వేలకు మించక పోవచ్చు. ఈ పద్యాలను ఒకటిగ సంకలనం చేసేటప్పుడు వేమన కవితను, వ్రాతను సవరించ ఎటువంటి ప్రయత్నం చేయకూడదు. వేమన ప్రజాకవి. ప్రజల భాషలో ప్రజలతో మాట్లాడాడు. ఆయన కవితలోని మాండలికతా మాధుర్యాన్ని సంరక్షించాలి. ఛందోవ్యాకరణాల కన్న వేమన సంక్షిప్తతకు, దురాచారఖండనకు ప్రాధాన్యతను యిచ్చాడు. లక్షణం తన లక్ష్యానికి అడ్డుగున్నపుడు దానిని నిర్లక్ష్యం చేయడానికి ఆయన ఎంత మాత్రం వెనుకాడలేదు. లక్షణ విరుద్ధ ప్రయోగాలను వేమన బుద్ధి పూర్వకంగ చేశాడు. గనుక వాటిని సవరించకూడదు. సలక్షణంగ వ్రాయాలనే దుగ్ధగల ఎవరో ఒకరు వేమనను తప్పు బట్టి వుంటారు. లేకపోతే వేమన ఇలా ఎత్తి పొడిచి ఉండడు :

ఆ॥ అది తెలుగవలెను యల్పుండు తామరి
చెప్పలేదు గాని తప్పుబట్టు;
తోయనేర్చు కుక్క దొంతల జేర్చునా ॥ విశ్వ ॥ (అకాడమీ.ప. 560)

కనుక వేమన పద్యాలను లక్షణ సమ్మతంగ చేయడం కాదు గాని, ఆధునిక శాస్త్రీయ పద్ధతికి అనుగుణంగ ఒక సంశోధిత సంకలనాన్ని సిద్ధంచేయటం అవసరం.

కొన్ని తాళపత్ర ప్రతుల్లో అసభ్యమైన పద్యాలున్నాయి. కొన్ని సందర్భాలలో వేమన విమర్శ వాడిగ, వేడిగ, కటువుగ ఉంటుంది. వేమన అసభ్యాన్ని ప్రోత్సహించి వుండడు. ఒక పద్యంలో ప్రత్యేకంగా కామవాంఛతో మసలే వారిని

వ్రాయబట్టాడు. అట్టివారు ముష్కరులని, బురదలో పొరిలే పందులని పేర్కొన్నాడు. కనుక ఈ సంశోధిత సంకలనంలో ఇటువంటి అసభ్య పద్యాలనన్నింటిని తొలగించాలి.

స్వర్ణయోగ విద్యకు సంబంధించిన పద్యాలను కూడ తొలగించి, వేమనకు న్యాయం చేకూర్చాలి. ఆ అజ్ఞానాంధకార కాలంలో అదృష్టాన్ని అందుకోడానికి పరుసవేది సులభమైన మార్గమని వేమన విశ్వసించి వుండవచ్చు. అయితే ఆయన అనతి కాలంలోనే ఆ శ్రమకు స్వస్తి చెప్పి ఉండకపోతే ప్రతి మూఢాచారాన్ని, అంధవిశ్వాసాన్ని ఖండించే గొప్ప ఆచార్యుడై వుండేవాడు కాడు. అందుచేత స్వర్ణ యోగ విద్యకు సంబంధించిన పద్యాలు ప్రక్షిప్తాలుగ మనం పరిగణింపవచ్చు. ఒకవేళ అవి వాస్తవంగనే వేమన కృతాలే అయితే, వాటిని స్వర్ణయోగ విద్యారహస్యాన్ని తమకు చెప్పమని వేమనను పీడించిన మూర్ఖుల్ని, దురాశాపరుల్ని పరిహసించడానికి చెప్పినవై వుండాలి. ఏది ఏమైనా అర్థరహితమైన ఇటువంటి పద్యాలను తొలగించాలి.

ఇలా అనవసరమైన పద్యాల నన్నింటిని తొలగించిన తదుపరి కూడ వేమన కవిత్వమనే అపరంజిలో ఇంకా కొంత కల్తీ శేషించి వుంటుంది. ఉత్తమ సత్కవులకు కూడ అది తప్పదు. తటిల్లతలాగ మెరసిన భావాలను ఆశురూపంగా వెలువరించే ఆశుకవుల కవిత ఆద్యంతం సమానంగ వుండదు. అసమానంగనే వుంటుంది. అంతే కాకుండ ముందే పేర్కొన్నట్లు వేమనకు సాహిత్యం పట్లకన్న జీవితం మీదనే అక్కర, శ్రద్ధ. వేమన పదాలను కళాకారులలాగ సుకుమారంగ ఉపయోగించడు గాని, ఈటెలిలా విసరుతాడు. వేమన కవిత విమర్శనాత్మకంగ లేనపుడు ప్రబోధాత్మకంగ వుంటుంది. ఆయన కవిత ఆద్యంతం ఒక్క రూపుగ వుండకపోవడానికి ఇది కూడ ఒక కారణమే. కవులను గురించి, కవిత్వాన్ని గురించి ప్రస్తావిస్తూ, పేర్కొన దగిన ఒక్క ఉత్తమ పద్యాన్ని రచించినా అతన్ని కవిగనే పరిగణించాలన్నది వేమన అభిప్రాయం :

ఆ॥ నిక్కమైన మంచి నీలమొక్కటి చాలు
తళుకు, బెళుకు రాళ్ళు తట్టెడేల
చదువ పద్యమరయ చాలదా యొక్కటి ॥ విశ్వ ॥ (బ్రౌన్. 1839. 2-4)

ఒక్కటి కాదుగాని, వేమన ప్రపంచానికి వందలకొలది నిక్కమైన మంచి నీలాలను ప్రసాదించాడు.

# ప్రకృతి దార్శనికుడు

సహజప్రజ్ఞ చతురుడైన గ్రామీణుడు
ప్రకృతి దార్శనికుల్లో ఒకడు.

— హొరెస్ (Horace)

వేమన విద్వాంసుడు కాకపోయినా, ప్రస్థానత్రయాన్ని గురించి (ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, భగవద్గీత - హైందవ తత్త్వప్రామాణిక గ్రంథాలు) తెలియకపోయినా, నిస్సందేహంగ ఒక దార్శనికుడు. ఈ ప్రకరణారంభంలో శీర్షికగ పేర్కొన్న హోరెస్ మాటల్లో పేర్కొనాలంటే వేమన "ప్రకృతి దార్శనికుడు." ఆయనకున్న సహజ అంతర్దృష్టి, పండిన జీవితానుభవం ఆయనను ఏకైక తత్త్వాన్ని కాక, మత సాంఘిక, నైతిక తత్త్వత్రయాన్ని ప్రబోధింప చేసింది. వీటిలో ఏ ఒక్కదానిని వేమన క్రమపద్ధతిలో విస్తరింపచేయలేదన్నది వాస్తవమే. విశృంఖలమైన ఆయన మేధస్సు, ఆవేశ పూరితమైన ఆయన స్వభావం క్రమపద్ధతిని పాటించలేకపోయాయి. స్వవచో వ్యాఘాతాలను సహితం సవరించడానికి ఆయన ప్రయత్నించలేదు. ఒకవేళ ఆయన వాటిని గుర్తించి వుంటే వాల్ట్ విట్‌మన్ (Walt Whitman) అన్నట్లు అని వుండే వాడే :

"నా వచనాలకే నేను వ్యాఘాతం కలిగిస్తున్నానా?
అట్లయితే మంచిదే నన్ను నేనే వ్యతిరేకిస్తున్నాను.
నేను విస్తారమైన వాణ్ణి నాలో సమస్తమూ ఇమిడి వున్నాయి.

సాంఘిక దార్శనికుడిగ వేమన మానవుల్లో సమానత్వాన్ని ప్రబోధించాడు. వర్ణవ్యవస్థ, ఆ వ్యవస్థలోని తరతమ భేదాలు, హెచ్చుతగ్గులు, విధి నిషేదాలు సంపూర్ణంగ రూపుమాయనంతవరకూ మానవ సమానత్వం అన్నది దుస్సాధమని వేమన ప్రగాఢ విశ్వాసం. వర్ణవ్యవస్థను నిర్మూలించాలనడానికి వేమన స్థూలంగ చూపిన కారణాలివి : శూద్రులకు వలె స్త్రీలు కూడ వేదపఠనం చేయకూడదని నిషేధించితే స్త్రీలస్థాయి కూడ శూద్రుల స్థాయిలాగ ఉంటుంది. అది పెరగదు.

అటువంటి స్త్రీ యొక్క పుత్రుడో, భర్తో, శూద్రుడే అవుతాడు కాని మరొకరు కావడానికి అవకాశం లేదు. అంతేకాక ప్రతివాడు పుట్టుకతో శూద్రుడనే చెప్ప బడింది. అటువంటప్పుడు పవిత్రమనబడే జందెం ధరించినంత మాత్రాన మానవుడు స్థాయి అధికం అవుతుందని ఎలా అనగలం? నిజంగా వ్యక్తికి కులం కాదు గాని గుణం ప్రధానం. "కులము లెక్క యేమి గుణమే ప్రధానంబు" (వావిళ్ళ. పుట. 49)

ఆ॥ మాల వాని నేల మరిమరి నిందింప
ఒడలనున్న మాంస మొకటిగాదె
వానిలోన వెలుగువాని కులంబేది. ॥ విశ్వ ॥

(బ్రౌన్. 1839. 129-455)

ఆ॥ మాలమాలగాడు మహిమీదనే ప్రొద్దు
మాట తిరుగువాడు మాలగాక
వాని మాలయన్న వాడెపో పెనుమాల. ॥ విశ్వ ॥

(బ్రౌన్. 1839. 82-135)

ఆ॥ మాలమేలు గుణము మంచిది కలిగిన
మాలకూడుఁ గుడుచు మనుజు కంటె
గుణమె మేలు కాని కులమేమి మేలురా? ॥ విశ్వ ॥

(వావిళ్ళ. పుట. 32)

ఆ॥ జాతి భేదమెంచి జన్మముల్ తెలియక
ముక్తి గానలేరు మూర్ఖజనులు
జాతులెంచనేల జన్మంబు తెలియుము. ॥ విశ్వ ॥

(వావిళ్ళ. పుట. 202)

ఒకడు తన కులీనతను గురించి ప్రగల్భాలు పలకడమెందుకు? మరొకని కులాన్ని నీచమని నిందించడమెందుకు? అందరు భగవంతుని బిడ్డలుకారా? సర్వ మానవాళి జన్మక్రమమూ, మరణపు తీరు ఒక్కటే కదా! కులభేదాన్ని పతిత్యజించిన వాడే నిక్కమైన భగవంతుని భక్తుడు.

వర్ణవిభేదమేకాక ఆర్థిక స్తోమత కూడ సమాజంలోని అసమానతకు కారణ మన్న విషయాన్ని వేమన గుర్తింపకపోలేదు. వర్ణభేదంకన్న ఆర్థికమైన వర్గభేదమే వ్యక్తికి వ్యక్తికి మధ్య పెద్ద అగాధాన్ని సృష్టిస్తుందన్నది వాస్తవానికి వేమన విశ్వాసం.

ఆ॥ అధముఁడైన మనుజుఁ డర్థవంతుండైన
వతని మాట నడచు నవనిలోన
గణపతింటనున్న గవ్వలు చెల్లవా? ॥ విశ్వ ॥
(వావిళ్ళ. పుట. 55)

ఆ॥ కులము లేనివాఁడు కలిమిచే వెలయును
కలిమి లేనివాని కులము దిగును
కులము కన్న నెన్న, గలిమి ప్రధానంబు. ॥ విశ్వ ॥
(బ్రౌన్. 1839. 83-142)

ఆ॥ కులము గలుగువారు గోత్రంబు గలవారు
విద్యచేత విఱ్ఱవీగువారు
పసిడిగల్గువాని బానిస కొడుకులు. ॥ విశ్వ ॥
(వావిళ్ళ. పుట. 82-137)

ఆ॥ కనకమున్నవాడు కాముడు భీముడు
మిగులఁదేజమంది మెలఁగుచుండ
విత్తహీనుఁడైన వెఱ్ఱులలోనేటు ॥ విశ్వ ॥
(వావిళ్ళ. పుట. 60)

ఇలా అంతిమ జాతివాడయినా వాడు సంపన్నుడయితే అధికుడు, కులీనుడు పేదవాడయితే వాడిని లక్ష్యపెట్టరు. అగ్రకులజుల్లో. విద్యాధికుల్లో కూడ డబ్బున్న వారికి దాసోహమనే బుద్ధిహీనులున్నారు. శ్రీమంతునిలో అన్ని సుగుణాలు, నైపుణ్యాలు, ఉన్నట్లు చూస్తారు. లేదా నటిస్తారు సౌందర్యంలో మన్మథుడని, బలంలో భీముడని అతణ్ణి పొగడ్తారు. డబ్బుకు దాసోహమనే ఇటువంటి మూర్ఖుల్ని వేమన అసహ్యించుకొన్నా, ధనబలాన్ని మాత్రం త్రోసిపుచ్చలేదు. ఇతర కవిభక్తా

గ్రేసరులైన అనేకుల వలె కాక వేమన కలిమి కన్న లేమి అధిక అనర్థదాయకమన్న అభిప్రాయం కలవాడు.

ఆ॥ తల్లిబిడ్డలకును దగవు పుట్టించెడు
ధనము సుఖము, గూర్పదని వచింత్రు
కాని గడనలేక గడచుటయెట్లురా? ॥ విశ్వ ॥
(వావిళ్ళ. పుట. 389)

ఒకడు పేదరికాన్ని స్వయంగ కోరుకుంటే అది అతన్ని ఉన్నతుని చేస్తుంది. కాని అతడెంత కష్టపడినా ధనాన్ని సంపాదించలేక దరిద్రుడుగ వుండిపోతే నైతికంగా భౌతికంగా ద్వివిధాలా దిగజారిపోతాడు :

ఆ॥ ధనము లేమి సుతలు తప్పుల నిడుదురు
ధనము లేమి పత్నిదాఁకరాదు
ధనము లేమెవనికి తాళిక నీయదు ॥ విశ్వ ॥
(బ్రౌన్. 1839. 148-117)

వేమన దృష్టిలో స్వకుటుంబానికి కొన్ని సౌఖ్యాలు, భద్రతలు చేకూర్చలేని మానవుడు సానుభూతికి అనర్హుడు. ఏవగించుకొనదగినవాడు. వేమన ఇలా హెచ్చరించాడు :

ఆ॥ ధనము లేమి యనెడు దావానలంబును
తన్ను జెరుచును దరిదాపు జెరుచు
ధనము లేమి చూడదలచనే పాపంబు ॥ విశ్వ ॥
(బ్రౌన్. 1839. 140-65)

వేమనకు పేదరికం పట్లగల భీతి, "దారిద్ర్యం అత్యంత హానికరమైనది. అతి నీచమైన నేరం దారిద్ర్యమే" అని ప్రకటించిన జార్జ్ బెర్నాడ్‌షా పలుకులలోని దారిద్ర్య నిరసనతో సమానమైనది.

అయితే షా చెప్పినట్లు కాక, వేమన యీ దారిద్ర్య నివారణ కొరకు సామాజిక పరిష్కారాన్ని చూపలేకపోయాడు. వేమన ఎంతటి దూరదృష్టి కలవాడైనా, అజ్ఞా

నాంధకారపూరితమైన మధ్య యుగాలకు చెందినవాడు కాబట్టి అంతటి ప్రగతిని వేమనలో ఎదురు చూడలేము. సమాజంలోని పేదరికానికి మూల కారణాల్ని కనుగొన లేని వేమన శ్రీమంతుల్ని వారి సంపదల్ని పేదవారితో పంచుకోమని వేడుకున్నాడు. యాచన అన్నది ఆత్మాభిమానాన్ని కోల్పోవడమని వేమన గుర్తించాడు. యాచించే వాడు పీనుగని పేర్కొన్నా వెంటనే వేమన అర్థికి గింజరాల్చనివాడు అంతకన్నా అధముడని పాత నమ్మకనే వెలిబుచ్చాడు :

తే॥ పుట్టినప్పుడు తెచ్చెనే పుడమి విడచి
గిట్టినప్పుడు గొనునొకో యట్టి ధనము
నడుమ నీయక్షివచ్చెఁద్రినయ
నర్థికిని నీయఁదేమందువ్యర్థువేమ! (వావిళ్ళ పుట. 306)

తాము గడనసేయు ధనము తమదియని
నమ్మియుంద్రు వెఱ్ఱి నరులు భువిని
తాము నొకరి కిచ్చు ధనమింతియే కాక
కడమది తమకేల కలుగు వేమ ! (బ్రౌన్. 1839. 134-22)

బసవనవలె వేమన కూడ కాయకష్టంలోని గౌరవాన్ని గుర్తించాడు. ప్రతి వ్యక్తి ఒక న్యాయమైన వృత్తిని గాని, మరేదైన ఉపాధిని గాని చేపట్టాలని కోరాడు. పౌరోహిత్యం మీద ఆయనకు గౌరవంలేదు. వర్తక వ్యాపారాల మీద కూడ వేమన కంత అభిమానం లేదు. మధ్యవర్తిత్వాన్నిఁ దళారితనాన్ని ప్రోత్సహించి, ఎదుటి వాణ్ణి కొల్లగొట్టే యే వృత్తి అయినా వేమనకు అసహ్యం. "నీ ముఖపు చెమట కార్చి ఆహారము తిందువు" అన్న బైబిల్లోని దైవవాక్కు (ఆదికాండం. 3 : 19) పట్ల సంపూర్ణ విశ్వాసాన్ని ప్రదర్శించిన గాంధీ, టాల్‌స్టాయిలతో వేమన ఏకీభవిస్తాడు. వేమన పద్యాలలో ఒకటి ఇదే సూత్రాన్ని, ఇంచుమించు ఇదే మాటల్లో వ్యక్తం చేస్తుంది. చేసే పని దైవారాధనతో సమానమని వేమన భావం. కాయకష్టమయితే ఇంకా మంచిది. చాకలి వానిని యితరులు చిన్న చూపు చూడవచ్చు. కాని వేమన దృష్టిలో రజకుడు సమాజానికి సేవచేసే ఉత్తములలో ఒకడు. ప్రాథమికావసర వస్తువుల్ని వుత్పత్తి చేసే వారంటే వేమనకు అభిమానం. అందులోను కర్షకులంటే అధికాభిమానం. వేమన ఒక సందర్భంలో తాను "కాపు" అని సగర్వంగ చెప్పు కొన్న దానిని ఆధారంగ చేసుకొని కొందరు వేమన కూడ వర్ణవిభేదానికి అతీతుడు

కాదన్న నిర్ణయానికి వచ్చారు. వేమన సోత్కర్షగ పేర్కొన్నది కులాన్ని కాదుగాని తన వృత్తియైన వ్యవసాయాన్ని. నైతిక ప్రబోధకుడు కాక పూర్వం వేమన ఒక కర్షకుడు. స్వవర్ణమైన రెడ్డిజాతిని గురించి ప్రస్తావించిన ఒకటి, రెండు సందర్భాలలో ఆ కులాన్ని గురించి వేమన ప్రశంసించలేదు.

స్థూలంగా చూస్తే వేమన సామాజిక తత్త్వం ఇటువంటిది. మధ్య యుగాలకు చెందిన భారతదేశపు భక్తులు, ఆచార్యులు, తాత్త్వికులైన బసవన, జ్ఞానదేవుడు, నమ్‌దేవ్, తుకారాం, రామానంద, కబీర్, దాదు, నానక్, లాల్‌దాస్, రాయిదాస్, చైతన్యుల సామాజిక తత్త్వంలో ఇంచు మించు సమానమైనవే వేమన తత్త్వం లోని మౌలికాంశాలు. ఈ భక్తాగ్రేసరులు, ప్రబోధకులు కలసి గొప్ప విప్లవాన్నే తెచ్చారు. ఎందుకు? "Modern Indian Culture" (ఆధునిక భారతీయ సంస్కృతి) అన్న తన ఉద్గ్రంథంలో ధూర్జటి ప్రసాద్‌ముఖర్జీ దీన్ని "తాత్త్విక విప్లవం" (The Mystic Revolution) అని పేర్కొనడం చాలా సమంజసం· "భారతీయ సమాజ ఆర్థిక స్థితిలో మౌలికమైన మార్పులు లేకుండా తెచ్చిన యీ తాత్త్విక విప్లవం మిథ్యా విప్లవంగా మిగిలింది.

ఇక వేమన నైతిక తత్త్వాన్ని పరిశీలించామంటే, అందులో రెండంతస్తులు వున్నట్లు కనుగొంటాం. వేమన ఆదర్శవాది అయినా మానవ స్వభావ పరిమితులు తెలిసినవాడు. అందరూ యోగులు కాలేరని ఆయనకు తెలుసు. యోగి కుండవలసిన లక్షణాలు లేకున్నా యోగ మార్గాన్ని చేపట్టి మూర్ఖుడైన కపట సన్యాసికన్న సత్య వంతుడు, నీతిపరుడైన గృహస్థు ఎంతో మేలని వేమనకు తెలుసు. అందుచేత వేమన ప్రజాసామాన్యానికి అనుగుణమైన నైతిక సూత్రాలను చెప్పాడు. యోగి ఆచరింప వలసిన కఠిన నియమాలను అనుసరించగల దృఢచిత్తులకు తద్భిన్నమైన సూత్రాలను ప్రబోధించాడు. ఆయన యీ యిరుతెగలకు చెందిన శ్రోతల నుద్దేశించి చెప్పడమే వేమనలో కనుపించే భావవైరుధ్యానికి, ద్వంద్వాభిప్రాయాలకు కారణం.

యోగమార్గాన్ని కోరుకొనే వ్యక్తికి వేమన సలహా ఏమంటే సంసారమొక బంధం, ఆదొక ఉచ్చు. మరణించినపుడు భార్య బిడ్డలు వెంట రారు; లైంగిక సుఖం చాల నీచమైనది, అసహ్యమైనది; సంపద బుద్బుదప్రాయం; ఆత్మావగాహన అన్న ఏకైక లక్ష్యసాధనకై సర్వస్వాన్ని త్యాగం చేయాలి. "అందరూ సిద్ధులు

కాలేరు. కాని నిశ్చయంగ నీవు ఉత్తమ వ్యక్తిగ, మంచి పౌరునిగ వుండవచ్చు. బాల్యదశలో విధేయుడైన పుత్రునిగ ఆసక్తిగల విద్యార్థిగ వుండు. న్యాయమైన వృత్తిని చేపట్టి శిక్షణను పొందు. యుక్తవయస్కుడైనపుడు పేదవారింటి బిడ్డ అయి నప్పటికి, అందమైన సాధుశీల అయిన కన్యను వివాహమాడు. అనురాగవతి, అనుకూలవతి అయిన అర్ధాంగి లభించడం అరుదైనప్పటికి, అటువంటి భార్యను పొందగలిగితే నీ ఆనందానికి అవధులుండవు. ఆ గృహలక్ష్మి తన గృహానికి నీవే ప్రభువన్న భావనను కలిగిస్తుంది. అనుకూలురైన సంతానం కలిగితే నీవు స్వర్గసుఖా లనే అనుభవిస్తావు. నీ సంసారానికి కొదవలేకుండ అన్ని అవసరాలను తీర్చడానికి, నిర్విరామంగా చెమటోడ్చి శ్రమించు. కష్టే ఫలి. శ్రమించకుండ ఏదీ జీవితంలో సిద్ధించదు. "నీరు పోయకుండా మల్లి పూయునా?" నిరంతరం దయామయుడవై, దాన తత్పరుడవై వుండు. ఇంటి వాకిటికి వచ్చి అర్థించే పేదల్ని నిర్దాక్షిణ్యంగ తరిమి వేయవద్దు. సత్కార్యాలకు సద్వినియోగ పరచకుండ తన సంపదను సమకూర్చుకునే వాడు పొలంలోని దిష్టిబొమ్మ వంటివాడు. తల్లి దండ్రుల్ని సన్మానించు. నీవెంత పేరు ప్రఖ్యాతుల్ని సంపాదించి శ్రీమంతుడవైనా, ఏ కారణం చేత కూడ నీ తండ్రిని చిన్న చూపు చూడకూడదు. సత్యాన్వేషకులు వేషభాషల్లో వింతగా కనుపించ వచ్చు. కాని వారిని పరిహసించకు. గర్వించకు డంబాలు పలుకకు. అహంకారియైన మూర్ఖుడు అందరికన్న పనికిమాలినవాడు. విశాల దృక్పథంతో, మంచి మాటలతో దానధర్మాలు చేస్తూ ఉన్నట్లయితే గృహస్థుడవైనప్పటికీ ఆత్మసంతృప్తిని, జీవిత సార్థకతను పొందగలవు. "పతిని బెనగువాడు సంసారయోగిరా."

కామవాంఛ అణచరానిదని స్వానుభవంలో తెలిసినవాడు గనుక వేమన ఇలా చెప్పాడు : "ఆడవారి అందచందాలకు మగవారు బానిసలు కావడం నిజమే. అత్యంత సౌందర్యవతియైన స్త్రీ సమక్షంలో సదామనోనైర్మల్యంతో వుండే యోగి కూడ వికల మనస్కుడౌతాడు అయినప్పటికి గృహస్థుగ నీవు నీ భార్యపట్ల త్రికరణ శుద్ధితో యథార్థంగ వుండాలి. పరసతిని కోరడమే కాదు; పరస్త్రీని మోహపుచూపులో చూడడం కూడ పాతకమే. నీకు డబ్బు వున్నా దేవదాసీలకు దూరంగ వుండు. దేవ దాసీలను చేరదీయకు. వాళ్ళెంత ఆకర్షణీయంగ, అందంగా వున్నా, వాళ్ళు నీచరాండ్రు, చంచల స్వభావులు, దురాశాపీడితులు; కఠిన హృదయులు. పిండి పార వేసే నిమ్మతొక్కలాగ నిన్ను దోచుకొని తరిమివేస్తారు. ఒకవేళ దేవదాసిని వుంచు కొని తీరాలన్న నిర్బంధమే ఏర్పడితే-ఇక్కడ వేమనలోని సహజ ప్రవృత్తి బహిర్గత

మవుతున్నది-సంగీత నాట్యాది కళల్లో ప్రవీణయై, సంస్కారవతియై, ఒంపు సొంపు లొలికే చూడచక్కని పడుచును ఎన్నుకో. ఆమె పొందును కోరడానికి ముందు ఆమె తల్లి సజీవురాలుగా లేదని నిర్ధారించుకో. [ఒక యోగి ఇటువంటి సలహాను ఎలా ఇవ్వగలడని ఆశ్చర్యపడేవారు. 19వ శతాబ్దాంతం వరకు దేవదాసిని వుంచుకొనడం హైందవ సమాజంలో మగసిరికి, గౌరవానికి చిహ్నంగ వుండేదన్న విషయాన్ని విస్మరించకూడదు.]

వేమన చెప్పినట్టి ఇతరమైన నీత్యుపదేశాలవి క్రింది విధంగ క్రోడీకరించవచ్చు.

"అన్ని పరిస్థితుల్లోను మీరు నమ్మిన సిద్ధాంతాలకు త్రికరణ శుద్ధిగ అంకితం కండి. స్థైర్యంగ నిలబడండి. సింహం బలహీనంగ రోగంతో వున్నపుడు కుక్క కూడ నిర్భయంగ ఎదిరిస్తుంది. అలాగని దుర్బలుల మీద మీ బలప్రదర్శనం చేయకూడదు. బలవంతుడు మౌనంగ వుంటాడు; అయితే అతడు దుర్నిరీక్షుడు కూడ. హింసను పరిహరించాలి. ప్రాణహింస చేయకుండా వుండడం ఒక మతసిద్ధాంతంగా ఆచరించాలి. కొందరు అవివేకులు మహాభారతాన్ని పంచమవేదంగ పేర్కొంటారు. రణరంగంలో సహోదరుల రక్తం చిందించడం వారికి ప్రియమని భావించాలా?

ఆ॥ చంపదగిన యట్టి శత్రుడు తనచేత
చిక్కెనేని కీడు సేయరాదు
పొసగ మేలుచేసి పొమ్మనుటే చావు ॥ విశ్వ ॥
(బ్రౌన్. 1839. 4-23)

జంతువుల్ని చంపడం కూడ హింసయే అవుతుంది. జంతువుల ప్రాణాల్ని ఎందుకు చులకనగ చూడాలి? మూర్ఖుని కన్న అది హీనం కాదు గదా!

ఆ॥ చంపఁగూడదెట్టి జంతువునైనను
చంపవలయులోన శత్రుగుణముఁ
దేలుగొండి గొట్టఁదేలేమి చేయురా? (వావిళ్ళ. పుట. 81)

జీవకారుణ్యంతో మెలకువగ జీవిస్తూ వృద్ధుడవు కావాలి. వార్థక్యమంటే బలహీనత కాదుగాని సుజ్ఞానం కలిగివుండాలి. జ్ఞానం కేవలం వయోవృద్ధుల సొత్తని భ్రమించరాదు. జ్ఞానవంతులైన కొందరు యువకులు కూడ నీ బాటను వెలిగించగలరు. "చిన్నచేతి దివ్వె పెద్దగా వెలుగదా?" పరిగను తినేవాడికి మధుర ఫలాల రుచి

తెలియదు; అలాగే చిన్న కళల్లో నైపుణ్యాన్ని సంపాదించిన వాడి గొప్ప జీవిత కళను మెచ్చుకోలేరు. నిజానికి కళలన్నింటిలో జీవిత కళే అత్యద్భుతమైనది.

వేమన స్త్రీల విషయంలో మాత్రం అంధుడే. అందుచేత వేమన సార్థకం కాగల వింత జీవితపు ప్రవాహికలో స్త్రీకి గౌరవ హీనమైన అథమస్థానాన్ని సూచించాడు. వేమన దృష్టిలో స్త్రీ సకలానర్థాలకు మూలం. అన్ని పాపాలకు పుట్ట. మానవాళి పతనానికి స్త్రీయే కారణభూతురాలు. స్త్రీకి దూరంగ ఉండడం ఉత్తమం. అలా చేయలేనప్పుడు ఆమెను సంపూర్ణంగ అదుపులో ఉంచాలి. ఆమెను గృహం వరకే పరిమితంచేసి సాధ్యమైనన్ని విధాల లొంగదీసుకోవాలి. స్త్రీల నిజాయితీని, విశ్వాసాన్ని నమ్మడం బుద్ధిహీనత. "సముద్రంలో ఓడ నడచుజాడ, అంతరిక్షంతో పక్షిరాజు జాడ వంటిది స్త్రీజాడ."

మగని కలిమి బలిమి మగువకును బలంబు
కలిమి లేని మగడు కానుగాడు
వనికిరాని మగని పాటించి చూడరు. ॥విశ్వ॥(వావిళ్ళ. పుట.72)

మాతృమూర్తిని గౌరవించాలి. నిజానికామెను దేవతగ పూజించాలని ప్రబోధించిన వేమన నోట స్త్రీలను గురించి యిటువంటి అభిప్రాయాలు వెలువడడం వింత. స్త్రీలను తూలనాడినప్పుడు, ముఖ్యంగా భార్యలపై విద్వేషాన్ని ప్రకటించినపుడు వేమన ఒక స్త్రీ ముందు మగనాలు కాకుండ మాతకాలేదన్న సత్యాన్ని విస్మరిస్తున్నాడు. ఏమైనా స్త్రీల విషయంలో వేమనవి విప్లవాత్మకమైన అభిప్రాయాలు కావు. సంకుచితమైన పూర్వాచారబద్ధమైనవి. వేమనకు గల ఈ సంకుచిత దృష్టికి క్యాంబెల్ ఒక కారణాన్ని చూపి సమర్థిస్తున్నాడు : "భారతదేశంలో స్త్రీలే సంస్కరణకు బద్ధశత్రువులు. సాంప్రదాయికమైన అభిప్రాయాలను, ఆచారాలను గుడ్డిగా నమ్మే స్త్రీ సముదాయం తన సంస్కరణల ప్రభావాన్ని బలహీనపరచి సంకుచిత బుద్ధితో తన ప్రయత్నాలను వమ్ము చేయవచ్చునని వేమన భావించి వుండవచ్చు." క్యాంబెల్ అభిప్రాయంలో నిజం లేకపోలేదు. కాని భారతదేశంలో స్త్రీలు వెనుకబడటానికి పురుషులే కదా కారణం? యుగాల తరబడి వారు స్త్రీలకు స్వాతంత్ర్యాన్ని, విద్యను, ప్రగతిని తిరస్కరించలేదా? సగభాగం స్వతంత్రంగా మరొక సగభాగం బానిసగా, సగభాగం విద్యావంతులుగా మరొక సగం నిరక్షరాస్యులుగ, కొందరు పురోగాములుగ అనేకులు తిరోగాములుగ వున్న ఏ సమాజమైనా

ప్రగతి పొందగలదా? అటువంటి సమాజంతో రెండవ సగం బరువుగ, భారంగ ఉంటే దానికి కారణమూ మొదటి సగానిదే అని చెప్పక తప్పదు.

వేమన వేదాలను తిరస్కరించినా వేమన మతతత్త్వంలో ఆయనొక వేదాంతి.

ఆ॥ వేద విద్యలెల్ల వేశ్యలవంటివి
భ్రమలఁ బెట్టి తేటపడగనీవు
గుప్తవిద్య యొకటి కులకాంత వంటిది ॥ విశ్వ ॥
(బ్రౌన్. 1839. 158-187)

అర్థం తెలియకుండ వేదాలను వల్లించే వారంటే వేమనకు గౌరవం లేదు. అట్టి వారిని "మొరిగే కుక్కలు" గా పోల్చాడు. వారి వేద పారాయణం వలన గాత్ర శిక్షణే గాని మరొక ప్రయోజనం పూజ్యమంటాడు. వేదాలలోని కర్మలు కూడ నిష్ప్రయోజనాలు. పురాణాలు "కల్లకథలగంప" పురాణాలు విగ్రహారాధనను ప్రోత్స హించి, విగ్రహారాధకులు పరతత్త్వాన్ని తెలుసుకోకుండ గుడ్డివారిని చేస్తున్నవి. చెక్కిన రాతి ప్రతిమలందు విశ్వాసముంచువారు. "అజ్ఞానులు," "బుద్ధిహీనులు", "తెలివిమాలినవారు" "పిచ్చివారు". మనోజ్ఞమైన దేవాలయాలను నిర్మించి వానిలో విగ్రహాలను ప్రతిష్ఠించిన రాజులు రణరంగంలో అపజయాన్ని పొంది హతు లయ్యారు; విగ్రహాలను పడగొట్టి ఆలయాలను శిథిలం చేసినవారు రాజ్యాలను పాలిస్తున్నారు. ఆలయాల్లోని దేవతా విగ్రహాలు వాటిని ఆరాధించే వారినెందుకు రక్షించలేదు?" ధర్మశాస్త్ర గ్రంథాలు న్యాయాన్ని ప్రతిపాదించకుండా అన్యాయాన్ని ప్రబోధిస్తున్నవి. పుస్తకాల్ని, పుస్తక పరిజ్ఞానాన్ని ఆధారం చేసికొనడం నిష్ప్రయో జనం. సర్వేశ్వరునితో ప్రత్యక్షంగా స్వానుభవంతో ఏర్పడిన అనుబంధం అటువంటి ప్రత్యక్ష సన్నిహిత ఆత్మానుభవాన్ని సాధించగలిగితే వారు ధన్యులే. ముక్తికి యేకైక మార్గం ప్రత్యక్షానుభూతి ఒక్కటే.

సూక్ష్మవివరాలను పరిగణించకుండ వేమన మత సిద్ధాంతాన్ని అద్వైతమత మని స్థూలంగ చెప్పవచ్చు. కేవలం వేదాల, ధర్మశాస్త్రాల ప్రామాణికతను తిరస్క రించడంలోనేకాక, పరమాత్మకన్న వ్యక్తిగత ఆత్మల ప్రాధాన్యాన్ని నొక్కి చెప్పడంచేత వేమన తదితర అద్వైతవాదులతో ఏకీభవించకుండ వ్యతిరేకిస్తున్నాడు

ఆ॥ బ్రహ్మ జంపి విష్ణు భాగంబులో గల్పి
విష్ణు జంపి శివుని వెలయ గల్పి
శివుని జంపి తాను శివయోగి గావలె. ॥ విశ్వ ॥
(బ్రౌన్. 1839. 59-396)

ఏ హైందవుడిలా బోధింప సాహసిస్తాడు? డా॥ జి. వి. కృష్ణారావుగారు వేమన తాత్త్వికతత్త్వాన్నిలా వివరించారు :

"మానవుని హృదయంలో నివసించే భగవంతుడు సంపూర్ణంగ మానవునికన్న భిన్నుడుకాడు. తన అహంభావాన్ని, కోరికల్ని విసర్జించి తన వ్యక్తిత్వాన్ని సంపూర్ణంగ విస్మరించి, పరమాత్మునిలో లీనమై తనలోని భగవంతుని దర్శింప గలిగినప్పుడు జీవి పరమాత్మునితో ఏకమవుతున్నాడు. కాదు; ఆతడే భగవంతుడు. ఈ సత్యాన్ని గ్రహించలేని మానవులు భగవంతుని దేవాలయాలలో, తదితర పుణ్య ప్రదేశాలలో వెదకుతారు.... మరికొందరు లోకాన్ని త్యజించి, మరొక లోకంలో మరణానంతరం ఆయన్ను కనుగొనగలమన్న నిరీక్షణతో తపస్సు చేస్తారు. ఇదొక గొప్ప భ్రమ. ఇందులో సత్యం ఎంతమాత్రం లేదు.

ఆ॥ ఇహమునందు సుఖము లీడేరఁ గాలేదు
పరము నందునెట్లు పడయవచ్చు
మొదల లేనిచేఁత తుది యెట్లు వచ్చురా? ॥ విశ్వ ॥
(వావిళ్ళ. పు. 22)

కనుక ఇంద్రియ గోచరమయ్యే యీ బ్రహ్మాండానికి ఆవల మానవుని అందు బాటుకు సుదూరంగ ఎక్కడో సర్వాంతర్యామి ఉన్నాడనడం తప్పు. ఇక్కడే మానవునిలో, మానవుని పరివేష్టించి పరమాత్మ ఉన్నాడు. మానవుడీ సత్యాన్ని గుర్తించి అంతర్ముఖుడై తనలో భగవంతుని వెదకాలి.

ఆ॥ ఊరు విడువకుండు నుత్తమ శివయోగి
పోరి చూచు మదిని పూర్ణసుఖము
దారిలోని నక్క తలపెట్టి బోవునే. ॥ విశ్వ ॥
(వావిళ్ళ. పుట. 40)"

సమస్త విషయాలలో మానవునికి ప్రాధాన్యతనిచ్చి, మానవుని కేంద్రంగ నిలిపే వేమన తత్త్వం ప్రధానంగా మానవతావాదం. Saint Vemana: His Philosohy (వేమన యోగి: ఆయన తత్త్వము) అన్న పుస్తకంలో, ఆ గ్రంథకర్త అయిన డా॥ ఈశ్వర తోపా (Dr. Iswara Topa) ఈ విషయాన్నే ఉద్ఘాటించారు. వ్యక్తికి స్వీయ సంస్కారాన్ని వేమన ప్రబోధించినట్లాయన పేర్కొన్నారు. తోపాగారిలా వివరించారు. "మానవతా సిద్ధాంతాలను పునాదులుగ చేసి వేమన తన ఆదర్శ సంస్కరణల భవనాన్ని నిర్మించాడు. ఆత్మ శుద్ధీకరణకు మానవుడు తానే స్వయంగ పాటుపడాలి. మానవునిలో అంతర్గతమైన అంతరంగిక శక్తుల్ని వెలికి తీయడంలో ఏ మానవాతీతశక్తి కూడ అతనికి తోడ్పడదు. అయితే సర్వమానవ సంక్షేమార్థం మానవశక్తుల్ని ఉదాత్తంగా సంస్కరించడం చాల ముఖ్యం అన్న గ్రహింపు అవసరం".

మానవ ప్రవృత్తిని, మానవేచ్ఛలను అణచడం కాదుగాని, వాటిని సంస్కరించాలన్నది వేమన సిద్ధాంతాలకు మూలాధారం. మానసిక విశ్లేషణకు మూల పురుషుడైన ఫ్రాయిడ్ (Freud) కన్న ముందే వేమన మానవ స్వభావాన్ని ఉత్తేజ పరిచే ప్రధానమైన భౌతికశక్తులలో ఒకటి లైంగిక ప్రవృత్తి అన్నది స్పష్టంగ సూచించాడు.

ఆ॥ పడుచు నూటికేల్ఁ బాఱ చూచెదరొక్క-
యెంత వారలైన భ్రాంతి పెంది
తోన మీఱు కాము లొంగఁ జేయఁగ లేక. ॥ విశ్వ ॥
(వావిళ్ళ. పు. 395)

ఒకనిలో కలిగిన ఐహికేచ్ఛల్ని ఆముష్మిక వాంఛలుగ మార్చాలని వేమన ప్రబోధము. జీవి యోగసాధనవలన పరమాత్మతో సమైక్యతను పొందటాన్ని వేమన స్త్రీపురుష సంయోగంతో పోల్చుతాడు. ఈ భావాన్నే వేమన మరొక విధంగ వివరించాడు, "కామిగాని వాడు మోక్షకామి కాఁడు." ఈ భావాన్ని ఊర్జితం చేయడానికే "సతిని పతికాంక్షతో సమీపించేలా యోగి భగవంతుని సాన్నిధ్యాన్ని కోరాలి" అని ఉద్ఘాటిస్తాడు.

నాగార్జున, శంకరాచార్యులవలె మహామేధావి, మహాపండితుడు కానందువల్ల వేమన తాత్త్వికుడిగ, దార్శనికుడిగ ప్రసిద్ధిని పొందలేదు. వేమన ఉపదేశాలు

కూడ క్రమబద్ధంగ లేవు. అయినా ప్రతి మానవుని స్పృశించే మానవ జీవితం లోని ప్రతి అంగాన్ని విశ్లేషించే వేమనది అనదగిన ఒక వ్యక్తిగత తత్త్వం ఉన్నది, సామాన్య విషయాల నుండి ఆధ్యాత్మిక విషయాల వరకు ఆ తత్త్వంలో తర్కింపబడ్డాయి. వేమన తత్త్వం ఎంత ఆదర్శప్రాయమో, అంత ఆచరణ యోగ్యం కూడ. "The Heart of India, Vemana" అన్న తన చిన్న పుస్తకంలో డా॥ ఎల్. డి. బార్నెట్ (Dr. L. D.Barnett) "వేమన మానవులకు సంబంధించిన దేనినీ నిర్లక్షంగ చూడలేదు." అని చక్కగా పేర్కొన్నారు. వేమనను గూర్చి, ఆయన మానవతా వాదాన్ని గూర్చి బార్నెట్ ప్రశంస అట్టిది బార్నెట్ యొక్క మానవతా భావన ఆయన్ను వేమనను గూర్చి ఇంకా ఇలా చెప్పేలా ప్రేరేపించింది :

> మానవాళికి బోధించిన బోధకులను, ఆచార్యులను హృదయశోధకులైన భగవంతుడు తన త్రాసులో తూచినపుడు, ఉద్ధతులు, మహాత్ములైన అనేకులు తెలంగాణాకు చెందిన ఈ అనాగరికునికన్న తక్కువ తూగుతారు.

# అపురూపమైన మహామేధావి

కవులలో ప్రతిభాశాలులు ఎంతో అరుదు,
విమర్శకులలో మంచి అభిరుచి కలవారూ అంతే అరుదు.

— పోప్

ఏ కోణం నుండి పరిశీలించినా వేమన మేధావి, అరుదైన మహామేధావి అనడంలో సందేహం లేదు. ఒక మారుమూలకుగ్రామంలో పుట్టి పెరిగిన వేమన ప్రపంచాన్నంతటిని తన స్వగ్రామంగ పరిగణించాడు. వేమన కొంత కాలం నైతికంగ పతితుడై నీచజీవితాన్ని గడిపినా, తరువాత తన్ను తాను తెలుసుకొని, ఆత్మసంయమనంతో మహాత్ముడయ్యాడు. గురూపదేశం లేకుండ భాషా శౌండీర్యాన్ని సంతరించుకొని కొత్త అందాలు చిందే వాడియైన భాషను వాడటం ప్రారంభించాడు. సాహిత్య శిఖరాగ్రాన్ని అధిష్ఠించాలి అన్న ఆశయం లేకుండానే, సమకాలంలోనే యుగయుగాల గొప్పకవి అయ్యాడు. విదేశీయ తాత్త్విక బోధనతో పరిచయంలేని వేమన స్వదేశపు తాత్త్విక చింతనతో మానవతను సూచించే ఆధునిక తత్త్వాన్ని ప్రబోధించాడు. అది సర్వగ్రాహకమైనది; సాహసోపేతమైనది. విభిన్న సైద్ధాంతిక రంగాలలో ఏకాకిగ యుద్ధాన్ని ప్రకటించాడు. సత్యస్థాపనార్థం మూఢాచారాలనే విగ్రహాలను విచ్ఛిన్నం చేశాడు. మానవుని మౌఢ్యశృంఖలాల నుండి విడిపించే నిమిత్తం అనేక మూఢనమ్మకాలను ఛిన్నాభిన్నం చేశాడు. మహా ప్రభంజనమై హానికరమైన సమస్తాన్ని సమూలంగ తుడిచిపెట్టాడు. శక్తిమంతమైన సందేశాలను వ్యంగ్యంతో చైతన్యవంతంచేసి బరువైన ఉపదేశాలను హాస్యంతో తేలికచేసి, తన తాత్త్వికతను చమత్కరించి అనేకులను ఆకట్టుకున్నాడు. మత సిద్ధాంతాలను పఠనయోగ్యంగ మార్చాడు, నీత్యుపదేశాన్ని గంభీరంగ, ఆకర్షణీయంగ రూపొందించాడు.

ప్రపంచంలో వేమన వంటి వాడు ఒక్కడే వుండగలడు. ఎందుకంటే ఆయన మేధస్సు ఆయనను ఏకైక విశిష్టవ్యక్తిగ మలచింది. అయినప్పటికి కొందరు ప్రపంచ విఖ్యాతులైన వ్యక్తులతో వేమనకు కొన్ని విషయాలలో సాదృశ్యమున్నది

లార్డ్ చాన్స్‌లర్ (Lord Chancellor) బేకన్‌లో కనబడే అవినీతికాక ఆయన వాక్యాలలోని సూక్తిప్రాయమైన సంక్షిప్తత, సముజ్వలత, పోప్ కవిలో కనబడే చిరచిరలాటలేని లాఘవం; ధారాళత, నిరాశావాదియైన డీన్ స్విఫ్టులోని మానవ విద్వేషం లేకుండా ఆయన రచనల్లో విరిసే వ్యంగ్య పర్యాప్త; రూసోలో కనబడే ప్రభుత్వాలను కూలదోయాలన్న ఆసక్తి లేకుండా ఆయన పంక్తుల్లో మెరిసే ప్రజ్వల వీరావేశం, ఆ వేగం; వాల్టేరుకున్నకుయుక్తి లేదు కాని ఆ విద్వాంసుని రచనల్లో గోచరించే సాహసం, వ్యాజస్తుతి; బెర్నార్డ్‌షాకున్న చమత్కారం, చాపల్యం స్పష్టతా; టాల్‌స్టాయికున్న సార్వకాలికమైన నైతిక అభినివేశం వేమనలో ఉన్నాయి. చారిత్రక వ్యక్తులనుకాక కల్పితపాత్రమైన డాన్ క్విక్‌సెటో (Don Quixote) ను వేమన తలపిస్తాడని అతని విమర్శకులు అనవచ్చు. ఇటువంటి అభిప్రాయం కలిగిందని ఎవరూ కోపగించుకోనక్కరలేదు. The Concise Oxford నిఘంటువు ప్రకారం Quixote అంటే "కేవలం ఉత్సాహవంతుడు, ఆదరించటానికి వీలుకాని ఉదాత్తమైన ఆశయాలు కలవాడు; గౌరవం కొరకు నిష్ఠకొరకు తన ఐహిక భోగభాగ్యాలను నిర్లక్ష్యం చేసేవాడు, వింత స్వభావం కలవాడు." ఈ గుణాలలో కొన్ని వేమనకు అన్వయిస్తాయి. అలా కాకపోతే వేమన ఏకైక విశిష్ట వ్యక్తిగ ప్రకాశించేవాడు కాదు. ఒక్కొక్కమారు వేమన తన ఆదర్శాన్ని హేతువాదాన్ని దృఢత్వాన్ని అతిగా సాగదీసేవాడు. తన చుట్టూ ఉన్న బూటకపు వ్యక్తులు విభిన్న మత శాఖలకు చెందిన వస్త్రాల్ని ధరించి ఆచార్యులుగ చెలామణి కావటాన్ని చూచిన వేమన తన జీవిత చరమదశలో బట్టలను త్యజించి దిగంబరుడయ్యాడు. వేమన అంటాడు :

ఆ॥ తల్లి గర్భమందు తాఁబుట్టినప్పుడు
మొదల బట్టలేదు తుదనులేదు
నడుమ బట్టగట్టనగు బాటుగాదొకో. ॥ విశ్వ ॥

(బ్రౌన్. 1839. 99-252)

వేమనలోని విలక్షణతకు మరొక కారణం అతనికి స్త్రీలపట్లగల రాగద్వేషాలు. ఇటువంటి దౌర్బల్యాలు, బలహీనతలు - వాటిని ఆ పేరుతో పేర్కొనవచ్చునంటే - అవే వేమన వ్యక్తిత్వాన్ని దేదీప్యమానంగ ఇంపుసొంపులతో నింపుతాయి. భారతదేశపు కవులలో కన్నడ సర్వజ్ఞుడు, హిందీ కబీరు, తమిళ

తిరువళ్ళువర్ కవుల అభిప్రాయాలతో వేమన అభిప్రాయాలు ఏకీభవిస్తాయి. తిరువళ్ళువరును డాక్టర్ జి. యు. పోప్ ఇలా ప్రశంసించాడు : "విశ్వమానవుని గూర్చి గానం చేసిన కవి గాయకుడు." వేమన కూడ ఒక కవిగాయకుడే. కాలాన్ని బట్టి చూస్తే ఈ కవులిద్దరికి మధ్య సుమారు పదిహేనువందల యేండ్ల తేడా ఉన్నది. ఇద్దరూ విభిన్న ప్రాంతీయులు. బహుశా ఇరువురిది భిన్నమతాలు కావచ్చు. భిన్నమైన రెండు భాషలలో రచించారు; అయినప్పటికీ వారి సందేశం మాత్రం ఒక్కటే – మానవ సమత. "జన్మతః మానవులందరూ సమానులు" అని తిరువళ్ళువరు పేర్కొన్నాడు. ఆ తదుపరి మానవులు భేదించడానికి వారి మతం, కులం కారణం కాదుగాని, స్వభావం, నడవడికలచేత వారు భిన్నమవుతున్నారు". తిరువళ్ళువరు ఇంకా ఇలా పేర్కొన్నాడు : "పుట్టుకతో కులీనులైనా వారు గుణవిహీనులైతే వారు అధములే. కడిజాతిలో పుట్టినా గొప్ప ఆదర్శాలను వెన్నాడే వారు గొప్పవారు" ఈ సత్యాలనే వేమన కూడ ఇంకా గట్టిగ నొక్కి చెప్పినట్లు ముందే పరిశీలించాం. మానవ సమతను గురించిన వేమన భావాలు మనోజ్ఞాలు, మహోన్నతాలు. సర్వుల్ని సమకట్టునవి గనుక వేమన ఇలా అన్నాడు :

ఉర్వివారికెల్ల నొక్క కంచము బెట్టి
పొత్తు గుడిపి కులము పొలయజేసి
తలను చెయ్యిబెట్టి తగనమ్మ జెప్పరా. ॥ విశ్వ ॥
(బ్రౌన్. 1839. 165–227)

కబీరువలె వేమన ఏకేశ్వరోపాసకుడు. భగవంతుడొకడే అని నొక్కి చెప్పాడు. కబీరుకు "రాముడు, అల్లా ఇరువురూ ఒక్కరే." వేమన కూడ "అన్నిట పరిపూర్ణుడల్లా మహమ్మదు" అని అన్నాడు. వేమనకు శివుడు, అల్లా ఇరువురూ ఒక్కరే. ఏకేశ్వర సిద్ధాంతం ఒకే మతాన్ని సహ జీవనాన్ని ప్రబోధిస్తుంది. కబీరుకు వలె వేమన కూడ ఈ సత్యాలనే ప్రత్యేకంగ నొక్కి వక్కాణించాడు :

"పసుల వన్నె వేరె పాలేకవర్ణమౌ
పుష్పజాతి వేరె పూజ యొకటి
దర్శనములు వేరె దైవంబదొక్కటే. ॥ విశ్వ ॥
(బ్రౌన్. 1839.28–189)

జాతి నీతి కేఱు జన్మంబు బహోకృటి
అరయదిండ్లు వేఱె ఆకటొకటి. (వే. వే. పుట. 10)

తే॥ భాషలెన్నిటి లోనైన భావమొకటె. (వావిళ్ళ. పుట. 364)

భూషణాల ఆకారాలు భిన్నమైనా అవి చేయబడిన సువర్ణం మాత్రం ఒక్కటే." ఇలా వేమన సమతా భావం ఎంతో సువిశాలమైనది. చేతనాచేతనా లన్నింటిని మిళితం చేసి విభేదాన్ని విస్మరించినట్టిది.

విగ్రహారాధనను నిరసించడంలో వేమన మరల కబీరుతో ఏకీభవిస్తాడు. "ఒక రాతిని పూజించటంవల్ల భగవంతుని కనుగొనగలిగితే నేనొక పర్వతాన్నే పూజిస్తాను" అంటాడు కబీరు.

రాతి బొమ్మకేల రంగైన వలువలు
గుళ్లు గోపురములు కుంభములును
కూడు గుడ్డతాను కోరునా దేవుడు. ॥ విశ్వ ॥ (వే.వే.పుట. 26)

అని ప్రశ్నిస్తాడు వేమన. శైవుల్ని ప్రత్యేకించి ఇలా ప్రశ్నించాడు :

రాతి బసవని రంగుగా మ్రొక్కుచు
గుమక బసవని గని గ్రుద్దుచుంద్రు
బసువ భక్తులెల్ల పాపులు తలపోయ. ॥ విశ్వ ॥
(బ్రౌన్. 1839. 165-240)

రాతి ప్రతిమదెచ్చి రాజసంబున నుంచి
పూజసేయు నరుడు బుద్ధిమాలి
భావమందు పరము భావించనేరడో ॥ విశ్వ ॥
(బ్రౌన్. 1839. 157-182)

మతపరమైన బాహ్యాచారాలను పరిహసించడంలో వేమన కబీరున కెంత మాత్రం తీసిపోడు. "నీటిలో మునిగినంత మాత్రాన మోక్షప్రాప్తి గలిగితే కప్పలు కూడ నీళ్ళలోనే జీవిస్తున్నవి కదా!" అంటాడు కబీరు. వేమన కూడ ఇట్టి భావాలను వ్యక్తపరచినట్లు ముందే సువిదితం. కబీరు, వేమన లిద్దరు పరస్పరం అపరిచితులైనా

జీవితాన్ని, జీవిత సమస్యల్ని సమానంగ సందర్శించారు గనుకనే సమాన సత్యాలను ప్రబోధించారు.

తిరువళ్ళువరు, కబీరు కన్నా భావనలో, భావవ్యక్తీకరణలో, స్వభావంలో వేమన సర్వజ్ఞునికి సన్నిహితుడు. వారిద్దరికున్న సమానమైన పూర్వరంగమే వారినంత సన్నిహితుల్ని చేసింది. యువకులుగ వారిద్దరు స్త్రీలోలురు. ఇద్దరూ మొదట దేవదాసీల వలయంలో పరిభ్రమించి ఆ తరువాత వారిని ఏవగించుకొన్నవారే. ఇద్దరూ ఆకస్మికంగా భోగాల పట్ల వైముఖ్యాన్ని ప్రదర్శించి, ఆధ్యాత్మిక చింతన వైపు మొగ్గును చూపారు. అయినా దేవదాసీలను గూర్చిన తలంపులు వారిని ఎంతగ వెన్నంటినవంటే క్రూరమైన సామాజిక వ్యవస్థకు బలియైన ఆ దురదృష్టవంతురాండ్రను అవకాశం దొరికినపుడెల్లా శపించకుండ విడువలేదు. వారిద్దరు స్త్రీ విషయంలో దుర్బలులు అని కూడ చెప్పాలి. వేమన సర్వజ్ఞులలో ఎవరు పూర్వకాలికులు అన్న ప్రశ్న వివాద గ్రస్తమైనా, వారిద్దరిని గురించి పరిశోధించిన రాళ్ళపల్లివారు, వేమన వల్లనే సర్వజ్ఞుడు ప్రభావితుడై యుంటాడని భావించడానికి అధికమైన ఆధారాలున్నవని అభిప్రాయపడ్డారు. ఏమైనా వారిద్దరిలో అనేకమైన సామ్యాలున్నప్పటికి: వేమన సర్వజ్ఞులు పరస్పరం ప్రతిబింబాలో లేదా ప్రతిధ్వనులో కారు. సర్వజ్ఞుడు వేమన కన్న అధిక లౌకికజ్ఞానంతో వాస్తవిక దృక్పథం కలవాడు. కొన్ని మౌలిక ఆదర్శాలను, అభిప్రాయాలకు ప్రాధాన్యమివ్వటంలో ఇద్దరు భేదిస్తున్నారు.

ఆధునిక బెంగాలీ మేధావులలో ఒకరైన ఆచార్య బినోయ్‌కుమార్ సర్కార్ "The Positive Background of Hindu Sociology" అన్న తన గ్రంథంలో ఇలా పేర్కొన్నారు: "తమిళ కురళ్‌లో ప్రబోధింపబడిన భక్తితత్త్వంలోని సర్వమానవ సమతా సిద్ధాంతం వేమన పద్యాలలో పురోగమించి సమాజ విప్లవానికి బాటలు వేసింది. భౌతికమైన ఆస్తిపాస్తుల అసమానతలను ఎత్తిపొడవడంలో వేమన ఎంత సహజ వ్యంగ్యాన్ని ప్రదర్శించాడో వర్గవిభేదాల వలన కలిగే ప్రతిబంధకాల్ని నిందించడంలోను అంతే తీవ్రతను కనపరిచాడు. హైందవ మతాన్ని దృఢపరచడంలో వేమన స్థానం కబీరు, చైతన్య ప్రభృతులకన్న అధికం కాకపోయినా, సమానమని నిశ్చయంగ చెప్పవచ్చు."

తిరువళ్ళువరు, కబీరు, చైతన్యులకున్నంత ప్రసిద్ధి ప్రచారాలు వేమనకు లేవు. తెలుగు వాఙ్మయకారులు వేమనను నిర్లక్ష్యం చేయడమే దీనికి ప్రధాన కారణం.

వేమన వెలుగులోకి రావటంత చేయడంలో వారు విఫలులు కావడానికి కారణం వారి ప్రయత్న లోపం కాదుగాని, దుబాయ్, బ్రౌన్, మ్యాక్ డొనాల్డ్, గోవర్, క్యాంబెల్, గ్రియర్సన్ వంటి విదేశీ విద్వాంసుల వారి దురాలోచనను ప్రతిఘటించడమే, కబీరు గ్రంథాన్ని రవీంద్రనాథఠాగూర్, తిరుకురళ్‌ను రాజాజీ అనువదించినట్లు వేమన పద్యాలను ఇంగ్లీషులోకి అనువదించిన వారు ఇప్పటికీ లేకపోవడం శోచనీయం. ఎంతో పట్టుదల గల బ్రౌన్ వేమనకు న్యాయాన్ని చేకూర్చలేకపోయాడు. బ్రౌన్ విదేశీయుడు. క్రైస్తవుడు. ఇటువంటి విదేశీ నేపథ్యంతో బ్రౌన్ వేమన కవితా హృదయాన్ని గాని, అతని భావాలను గాని సంపూర్ణంగా అవగాహన చేసుకోలేక పోయాడు. ఉదాహరణకు బ్రౌన్ అనువదించిన ఒక వేమన పద్యం :

పుణ్యము గలవాని పుష్టంబు పుండైతె
వసుధలోన చాల వార్తకెక్కు
పేదవాని యింట పెండ్లైన నెరుగరు. ॥ విశ్వ ॥

(అకా. ప. 667)

If even a boil rise on the back of a man of virtue, it will become notorious. But if even a marriage happen in the house of a poor man, no one hears of it.

ఇంగ్లీషు అనువాదంలో కొన్ని అనౌచిత్యాలు దొరలడమేకాక బ్రౌన్ ఒక సీతిమంతుని ఒక పేదవానితో వేమన పోల్చినట్లు తప్పు అభిప్రాయాన్ని కలిగించి, వేమనకు అన్యాయాన్ని చేశారు. వేమన అటువంటి బుద్ధిహీనమైన భావాలు లేని సుకవి. "పుణ్యము గలవాడు" అని వేమన రచించిన దానికి "Man of Virtue" అన్నది సరియైన అక్షరానువాదం. పూర్వజన్మ సుకృతంవల్లనే ఈ జన్మలో సంపన్నులవుతారన్న నమ్మకగల హిందువులకు, ఆ సందర్భంలో ఆ పదం ఒక శ్రీమంతుడని అర్థం అవుతుంది. ముందే పేర్కొన్నట్లు ఎంతో వ్యయప్రయాసల కోర్చి వేమనను ఉద్ధరించిన బ్రౌన్‌ను తప్పుపట్టడం సంస్కారహీనత అవుతుంది. అయినా రవీంద్రనాథ, రాజాజీల వంటి వారు వేమనను ఈ విశాల విశ్వానికి ఇంగ్లీషులో వక్రమంగ ప్రదర్శించాలని కోరకుండ ఉండలేము. "The Musings of a Mystic" (ఒక తాత్త్వికుని చింతనలు) అన్న శీర్షికతో ఇటీవల మీర్ మహమ్మద్‌ఖాన్ వేమన పద్యాలను కొన్నింటిని ఎన్నుకొని ఇంగ్లీషులోనికి అనువదించారు. అవి బ్రౌన్ అనువాదానికన్న కొంత మెరుగుగ ఉన్నాయి.

అయినా ఫాక్స్‌గారే ఇలా ఒప్పుకున్నారు "నాకు తెలుగు భాషలో తగినంత పాటవం లేనందువల్ల వేమన కవితా సొబగులోని సూక్ష్మతను ఆకళింపుకోలేక పోయాను."

వేమన కవితను సక్రమంగ అనువదించడానికి ఒక రాజాజీయో లేక ఒక రవీంద్రనాథో కావలసి వచ్చినట్లే వేమనను చిత్రింప ఒక రఫేల్ (Raphael) లేదా రెంబ్రాన్డ్ట్ (Rembrandt) వంటి చిత్రకారులు కావాలి. ఆ అంతస్థుకు చెందిన ఉత్తమ చిత్రకారుడు మాత్రమే కండ్లలోని కాంతిని; అధరాలపైని వక్రదర హాసాన్ని, నడకలోని చురుకుదనాన్ని ప్రతిబింబించగలడు. ఉత్తమ చిత్రకారుడు కూడ ఒక చిత్రాన్ని చిత్రించితే చాలదు. వేమన వ్యక్తిత్వంలోని విభిన్న కోణాల్ని ప్రదర్శించడానికి చిత్రపరంపరను చిత్రించాలి. ఒక క్షణంలో మృదువుగ, మరుక్షణంలో కటువుగ మరొక క్షణంలో చీకాకుగ దర్శనమిస్తాడు వేమన. క్షణ క్షణం మారే ఈ భావాలతో కేవలం ముఖకవళికలు మారడమే కాదు గాని, అతని లోని ప్రతికండరమూ మార్పు చెందుతుంది. సామాన్య కవి లక్షణాలు వేమనకు వర్తించవు. ప్రతిపదాన్ని ఆచి తూచి. నగిషీలు చెక్కి, ఒక ఉదాత్త ధ్వనిని కల్పిస్తాడు వేమన. అలాగే అనేక తత్త్వవేత్తల, ప్రవక్తలకన్న భిన్నమైన వాడు వేమన. గజదంతపు గోపురాలను ఉన్నత పీఠాలను ఎన్నడూ వేమన కోరలేదు. తన సందేశాన్ని ప్రకటించడానికి వేమన రాస్తా కూడలిలో నిలుచొని నిర్మోహమాటంగ, నిర్భయంగ మాట్లాడవచ్చు. అతని ప్రబోధాలను వ్యతిరేకిస్తూ రాళ్లు విసరినా కుక్కలను అతని పైకి ఉసికొలిపినా వేమనకు లక్ష్యంలేదు. వేమన కవిత్వంలో తరచు కుక్కల ప్రస్తావన ఉండటంచేత, బహుశా అతని పైకి కుక్కల్ని తోలి ఉండ వచ్చని అనిపిస్తుంది. క్రీస్తు, సోక్రటీసులను గురించి వేమన విని ఉండడు. కాని ప్రవక్త తన స్వజనులలో, స్వస్థలంలో, సమకాలంలో గౌరవింపబడడన్న సత్యాన్ని మాత్రం వేమన ఎరుగును. పెరటిచెట్టు మందుకు పనికిరానట్లే, యోగిని స్వజనులు గౌరవించరని ఒక పద్యంలో చెప్పాడు.

కవి, తాత్త్వికుడు, దార్శనికుడు, అనేక విధాల ఉదాత్తుడైన వేమన సర్వజాతులకు, సర్వకాలాలకు వర్తింపగల సందేశాన్ని యిచ్చాడు. నైతిక పతనంతో నిరాధారంగ ఎటుపోవటానికి దిక్కుతోచకున్న నేటి ప్రపంచానికి వేమన సందేశం చాల సముచితమైనది. మానవులు మానవులుగ జీవించితే ఈ భువిలో దివిగ వుంటుందని

వేమన పేర్కొ-లేదా? మనం నివసిస్తున్న ఈ వాస్తవ ప్రపంచాన్ని కాదని మిథ్యా స్వర్గానికై తాపత్రయ పడడం బుద్ధిహీనతని చెప్పలేదా? మనం నిలిచిన ప్రదేశమే పవిత్రమైన పుణ్యస్థలమని చాటలేదా? వేమన మతం మానవతావాదం. వేమన సందేశం ప్రేమ, మానవాళిలో పరస్పరావగాహన, స్నేహభావం. అతని లక్ష్యం సర్వమానవ సౌభ్రాతృత్వస్థాపన. నిరీశ్వర వాదికి, చార్వాకునికి కూడ ఇలా వేమన ఒక సందేశాన్ని అందించాడు. పరుల బాధను తన బాధగా భావించేవాడే మానవుడు. అన్నది వేమన సందేశ సారాంశం.

అన్యులకు వచ్చు నాపద తనదిగా
మన్నవాడు భువిని మన్నవాడు
మన్నవారిలోన మహిమపరంబును లెన్స
కన్నవాడు మిగుల ఘనుడు వేమ. (అకా. ప. 615)

# వేమన పద్యరత్నాలు

వేమన కవితామాధుర్యాన్ని, పదాల కూర్పులోని పొందికని, ధ్వనుల్లోని ఇంపుసొంపుల్ని ప్రదర్శించి, చవిచూప క్రింద కొన్ని పద్యాలు ఉదహరింపబడ్డాయి:

సంఘానురక్తి

ఎంత చదువు చదివి నెన్ని విన్ననుగాని,
హీను డవగుణంబు మానలేడు:
బొగ్గుపాల గడుగబోవు నా మలినంబు ॥విశ్వ॥ (బ్రౌన్. 1839. 70_52)

సకల శాస్త్రములను జదివియు వ్రాసియు
తెలియగలరు చావు తెలియలేరు
చావు తెలియలేని చదువులవేలరా ॥విశ్వ॥ ( ,, ,, 89_188)

మతము లెన్నియైన సతముగా నుండవు
సతముగాను యుండు జగతి నొకటి
యంత మదము విడిచి నాబ్రహ్మమరయుట ॥ విశ్వ॥
( ,, , 115_359)

ఒడల బూది పూసి జడలు ధరించిన
నొడయ డగును ముక్తి బడయలేడు
తడక బిఱ్ఱు వెట్ట దలుపుతో సరియౌనె? ॥విశ్వ॥
( ,, ,, 123_416)

"ముట్టు ముట్ట"నుచును "ముట్టరాద"ందురు
ముట్టుకు దరియేమి మూలమేమి?
నవ బిలముల మురికి నరుల కందరకును
పుట్టగానె పుట్టు ముట్టు వేమ. ( ,, ,, 147_111)

## విగ్రహారాధన

రాళ్ళు తెచ్చి నరులు రమ్యమౌ గుడిగట్టి
రాతిప్రతిమ చేసి ఖ్యాతిగాను
దేవతనుచు మ్రొక్కి దీవించి పట్టునా ॥విశ్వ॥ (వే. వే. 25-19)

పడిపడి మ్రొక్కగ నేటికి
గుడిలోపల కఠినశిలల గుణములు చెడునా?
గుడి దేహ మాత్మ దేవుడు
చెడువాళ్ళకు వట్టిపూజ సేతురు వేమా! (బ్రౌన్. 1839. 160-201)

మన్ను మెత్తి కరిగి మరి రూపుగావించి,
గుంటనిండ బూడ్చి గురుతు నిల్పి
మనుజులెల్ల గూడి మరిదేవుడందురు ॥విశ్వ॥ ( ,, ,, 161-241)

గట్టురాళ్ళ దెచ్చి కాళ్ళచేతుల ద్రొక్కి
కాసె యులులచేత గాసి జేసి
మొకపరాళ్ళ కెరగు మొప్పెల నేమందు ॥విశ్వ॥ ( ,, ,, 165-238)

రాతిబసువని గని రంగుగా మ్రొక్కుచు,
గునుక బసువని గని గ్రుద్దుచుంద్రు,
బసవ భక్తులెల్ల పాపులు తలపోయ ॥విశ్వ॥ ( ,, ,, 165-240)

తోలు కడుపులోన దొడ్డవాడుండగ
రాతి గుళ్ళలోన రాశిబోయ
రాళ్ళు దేవులైన రాసులు మ్రింగునా? ॥విశ్వ॥ ( ,, ,, 165-239)

## కులము

పరగబొమ్మ గుడ్డు బరికించి చూచిన
కులము లన్నియందు గూడ బుట్టె
నందరొకట గలియ నన్నదమ్ములేకదా? ॥విశ్వ॥ ( ,, ,, 162-217)

కూడ నేమిచేసె కులమేమి చేసెను
భూమి యేమిచేసె బొందికకై
నడుమ నడచు పొట్లు నగుబాట్లు చూడగా ॥విశ్వ॥ (బ్రౌన్. 1839. 162-218)

శూద్రజనము మఱిని శూద్రుల బోనాడు
మాలకన్న వెడగు మహిని లేదు.
నరకమునకు నేగు నష్టమైన వెనుక ॥విశ్వ॥ ( ,, ,, 163-223)

కులము హెచ్చు తగ్గు గొడవలు పనిలేదు
సానుజాతమయ్యె సకల కులము
హెచ్చు తగ్గు మాట లెట్లెరుంగగవచ్చు ॥విశ్వ॥ ( ,, ,, 163-225)

మాలవాని నేల మహిమీద నిందింప
నొడల రక్తమాంస మొకటె కాదె
వానిలోన మెలగు వాని కులంబేది? ॥విశ్వ॥ (వావిళ్ళ. పుట 510)

మరణము

ఇనుము విరిగెనేని యినుమారు ముమ్మారు
కాచి యతక నేర్చు కమ్మరీడు;
మనసు విరిగెనేని మరి యంటనేర్చురా? ॥ విశ్వ ॥ (బ్రౌన్. 1839. 8-50)

కుండ పగిలెనేని కొత్తది గొనవచ్చు
భూతలంబు నందు బొందుగాను
కూలబడిన నరుడు కుదురుట యరుదయా! ॥విశ్వ॥ ( ,, ,, 13-82)

తనువు విడిచి తాను తర్లిపోయెడువేళ,
తనదు భార్య సుతులు తగినవార
లొక్కరైన నేగరుసురు మాత్రమెకాని,
తనదు మంచితోడు తనకు వేమ. ( ,, ,, 80-120)

ఎవ్వ రెరుగకుండ నెప్పుడు పోవునో?
పోవు జీవమట్ల బొంది విడిచి,

మంత్రమాత్రమునకు సమకూర్తి నెరుగక,
[illegible] నరుడు వెర్రి వేమ! (బ్రౌన్.1839.89-119)

వెళ్ళవచ్చునాడు మళ్ళి పొయ్యేనాడు;
వెంటరాదు ధనము కొంచబోడు,
తాను యేకపోనొ ధనమేకపోవునో? ॥విశ్వ॥ ( ,, ,, 8-17)

## సత్సతులు

గుణవతి యగు యువతి గృహము చక్కగనుండు
చీకటింట దివ్వె వెలుగురీతి;
దేవి యున్న యిల్లు దేవార్చన గృహంబు ॥విశ్వ॥ ( ,, ,, 11-71)

ఇచ్చి పుచ్చుకొన్న హితమైన మనుములు
తగ్గులేక నర్లు తామరవలె;
కాచి పూచి పండి కను రమ్యమైయుండు ॥ విశ్వ ॥ ( " " 91-201)

సతికి పతికినైన సంపద సంపదే?
పుత్ర సంపదలును భువిని మేలు
సరిగ ముడిపి బ్రతుకు సంపద సంపద. ॥ విశ్వ॥ ( " " 91-202)

పనస తొనలకన్న పంచదారల కన్న
జుంటి తేనెకన్న జున్ను కన్న
చెరుకు రసము కన్న చెలి మాట తీపిరా ॥ విశ్వ ॥ ( " " 67-30)

అవనెరిగిన మగువ యనువెర్గు చనువెర్గు
ముదముతోడ మగవి మోహమెరుగు,
విభుని శ్రేష్ఠగుణము వేశ్యతా నెర్గునా? ॥ విశ్వ ॥ ( " " 90-195)

## దుష్టసతులు :

నీళ్ళమీద జూడు నెరయ నోడలపర్వు;
బయిలు మీద జూడు పక్షిపర్వు
నాడు వారి గమన మాలాగునుండురా ॥ విశ్వ ॥ ( " " 73-70)

కలిమినాడు మగని కామిని సూచును,
లేమి జిక్కినాడు లేవకుండు
మనిన మగనినైన మడియంగ జూచును ॥ విశ్వ ॥ (బ్రౌన్.1839.73-73)

ఆలు పతి సౌఖ్యములకి [ల]
నాలాయంబైన దాని యాలన వచ్చున్
ఆలాగున గాకుండిన
కాలుని పెనుదూతగదర కదియగ వేమా, ॥విశ్వ॥ ( " " 92-209)

ఆలు మగని మాట కడ్డంబు వచ్చె నా
యాలు గాదది మరణాలు గాని,
యట్టి యాలి విడిచి యడవి నుండుటమేలు ॥విశ్వ॥ ( " " 65-15)

మాట వినని యాలు మగనికి మృతియౌను
ఘోర పడగ సర్పమొంటి గ్రహము
తనకు గాని యాలు దానవురాలయా ॥ విశ్వ ॥ ( " " 65-16)

ద్విజన్ముడు :

శూద్రులందు బుట్టి శూద్రుల దూషించి,
ద్విజుల మనెడు పేరు నిజము జేసి,
మనస్సునిల్పకున్న మరి శూద్రుడధముండు॥విశ్వ॥ ( " " 154-162)

వేష మొనర గట్టి వెలయ శూద్రత్వంబు
తనకు లేదనుకొను ధరణి ద్విజుడు
అరిది గిట్టు వేళనడగు ద్విజత్వంబు ॥ విశ్వ ॥ ( " " 155-167)

ఇల్లు నాలు విడిచి యినుప కచ్చల గట్టి,
వంటకంబు నీరు వాంఛలుడిగి
వంటినున్న యంతవచ్చునా తత్త్వంబు? ॥విశ్వ॥ ( " " 157-178)

మాదిగె చెయివులను మనసులో బెట్టుక
మాదిగెలను దెగడు మాదిగెపుడు
మంచి గుణములేక మరి ద్విజుడెట్లగు ॥ విశ్వ ॥ ( " " 154-164)

విప్రవరుల మనుచు వేదంబు జదువుదు.
బ్రాహ్మణులను జూచి పరిహసించు
ధరణి సురలకన్న దాసరి ఘనుడౌను ॥ విశ్వ ॥ (బ్రౌన్.1839.155-196)

జ్ఞాన వివేచన :

తాను పెంచి చేయ తగబెట్టి కార్యంబు;
వేగిరింప నదియు విషమగును
పచ్చికాయ దెచ్చి పసవేయ ఫలమౌనె ॥విశ్వ॥ ( " " 4-24)

నీళ్ళలోన వోడ నిగిడి తిన్నగ బ్రాకు.
బైట మూరెడైన బ్రాకలేదు;
నెలవు దప్పుచోట నేర్పరి కొరగాడు ॥ విశ్వ ॥ ( " " 5-25)

నీళ్ళలోన మొసలి నిగిడి యేనుగు బట్టు,
బైట కుక్కచేత భంగపడును;
స్థానబలిమి గాని తన బల్మి కాదయా ॥విశ్వ॥ ( " " 5-26)

పంది పిల్లలీను పదియునై దింటిని;
కుంజరంబు యీను కొదమ నొకటి.
యుత్తమ పురుషుండు యొక్కడె చాలడా? ॥విశ్వ॥ ( " " 5-28)

ఎరుగు వాని దెలుప నెవ్వడైనను జాలు;
నొరుల వశము గాదు వోగుదెల్ప;
యేటి వంక దీర్ప నెవ్వరి తరమయా? ॥ విశ్వ ॥ ( " " 5-29)

అల్పుడెపుడు బల్కు నాడంబరముగాను;
సజ్జనుండు బలుకు చల్లగాను
కంచు మోగినట్లు కనకంబు మోగునా ॥ విశ్వ ॥ ( " " 5-30)

గంగపారుచుండు కదలని గతితోడ;
మురికి కాల్వపారు మ్రోతతోడ;
దాత యోర్చినట్లధము దోర్వగాలేదు. ॥ విశ్వ ॥ ( " " 6-32)

అకట తరుచు కల్లలాడెడు వారింట
సిరిం జేల లక్ష్మి స్థిరముండు?
ఓటికుండ నీరు పోసిన చందాన ॥ విశ్వ ॥ (బ్రౌన్.1839.11-78)

మానవుడు-దేవుడు

తాను సమస్తంబై తన
లోననె సకలంబు దెలిసి లోనను దెలియన్
తానని మెలఁగగ నేర్చిన
మానవునకు ముక్తి గలదు మహిలో వేమా. (అకాడమి. ప్రతి. ప. 133)

విష్ణువునకు సొడ్డు వృషభాంకునకు సొడ్డు
బ్రహ్మకైన సొడ్డు బలవుగాను
వేమన కొక సొడ్డు వేసితనని చెప్పు ॥ విశ్వ ॥ ( " " " 271)

తల్లి నెరుగువాడు దైవంబు నెరుగును
మన్ను నెరుగువాడు మిన్ను నెరుగు
మిన్ను మన్నెరిగిన తన్ను దానెరుగురా ॥ విశ్వ ॥ ( " " " 336)

బ్రహ్మ యెవని కొడుకు పరికింపగా భువి
విష్ణువెవని కొడుకు వెలయజూడ
శివుడు యెవని కొడుకు సిగ్గెరుగరు జనుల్ ॥విశ్వ॥ ( " " " 416)

మతము లెన్నియైన సతముగా నుండవు
సతముగాను యుండు జగతి నొకటి
యంతమతము విడిచి నాబ్రహ్మమరయుట ॥విశ్వ॥ ( " " " 686)

హింస జేయకుంటయే ముఖ్య ధర్మంబు
యనక హింస జేతు రవనిసురలు
చావుపసిని దినెదు చండాలుడే మేలు ॥ విశ్వ ॥ ( " " " 856)

శిలలు జూచి నరులు శివుడని మెత్తురు
శిలలు శిలలు గాని శివుడుగాడు
తనదులోని శివుని దానేల తెలియడో ॥ విశ్వ ॥ ( " " " 905)

ఏకతమున జూడ నెరుక యేకంబౌను
భువిని కాంత జేరు పురుషుమాడ్కి
లోక కాంతునివలె లోపల వెలుగును ॥ విశ్వ ॥ (అకాదమి.ప్రతి ప.1192)

వెండి బంగరెన్ని కొండలై యుండంగ
దేవుడేలపోయి తిరిపమెత్తె
యెదుటివారి సొమ్ము యెంతవారికి తీపి ॥ విశ్వ ॥ ( " " " 926)

మాయ జగమటంచు పరి బల్కుచుందురు
మాయగాదు బ్రహ్మమయము గాని
మాయమైన పరము మరియేడనున్నది ॥ విశ్వ ॥ ( " " " 939)

# సంప్రతించిన గ్రంథాలు

తెలుగులో వేమన జీవితచరిత్రలు అనేకం ఉన్నాయి. వేమన జీవితానికి సంబంధించిన ప్రసిద్ధ గాథలు మాత్రమే కొద్ది మార్పులతో వీటన్నింటిలో గ్రంథస్థం చేయబడ్డాయి. ఈ కారణంచేత ఈ రకమైన గ్రంథాలు ఒకటి, రెండు మాత్రమే ఈ పట్టికలో చేర్చబడ్డాయి. అలాగే వేమన పద్యాలకు వ్యాఖ్యలుకూడ అనేకం. అవి వేమన పద్యాల్లోని అంతరార్థాన్ని వివరించ ప్రయత్నించాయికాని వాటి వివరణ చాలవరకు అర్థరహితమైంది. అందుచేత వాటిని గ్రహించలేదు. వేమన పద్యసంకలనాలు కూడ అసంఖ్యాకమే. ముఖ్యమైనవి మాత్రమే ఇక్కడ పేర్కొనబడ్డాయి. వేమనను గురించిన పుస్తకాలను వేమన రచించిన పుస్తకాలను మూడు విభాగాలుగ వర్గీకరించాను: (i) తెలుగు (ii) తెలుగు - ఇంగ్లీషు (iii) ఇంగ్లీషు. కనుక ప్రత్యేకంగ ఎంపికచేసిన పుస్తకాలు మాత్రమే ఇక్కడ గ్రహింపబడ్డాయి.

## తెలుగు


1. వేమన యోగీంద్ర చరిత్రము: ఆర్. పూర్ణయాచార్యులు, మచిలీపట్టణం 1913.
2. వేమన సూక్తిరత్నాకరము(4,035 పద్యాలు): ఆర్. పూర్ణయాచార్యులు మచిలీపట్టణం, 1913.
3. శ్రీ వేమనయోగి జీవితము: పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి, వావిళ్ళ రామశాస్త్రులు & సన్స్ మదరాసు. 1917.
4. పోతన, వేమనల యుగము: దిగవల్లి వేంకటశివరావు, 1924.
5. మహాయోగి వేమనకవి; నేదునూరి గంగాధరం, సి. వి. కృష్ణా బుక్‌డిపో, మదరాసు (తేదిలేదు)
6. వేమన (సర్. ఆర్. వేంకటరత్నం ధర్మనిధి ఉపన్యాసాలు): రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు, వాల్తేరు. 1947 (పునర్ముద్రణ)

7. కవిత్వవిచారము: సి. ఆర్. రెడ్డి, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు, వాల్తేరు. 1947. (పునర్ముద్రణం)

8. వేమన: వంగూరి సుబ్బారావు, కమలాకుటీర్, నర్సాపురం, 1951. (పునర్ముద్రణం)

9. శతక వాఙ్మయ సర్వస్వము, ప్ర.శా: వేదం వేంకటకృష్ణశర్మ, మదరాసు, 1954.

10. వేమన పద్యములు, పీఠికతో. (2,728 పద్యాలు): వావిళ్ళ రామస్వామి శాస్త్రులు & సన్స్, మదరాసు. (1955. పునర్ముద్రణ)

11. శతక కవుల చరిత్రము: వంగూరి సుబ్బారావు, కమలాకుటీర్,నర్సాపురం. 1957. (పునర్ముద్రణం)

12. వేమన పద్యములు (5,010 పద్యాలు): సంకలన కర్త–నేదునూరి గంగాధరం అద్దేపల్లి కంపెని, రాజమండ్రి. 1960.

13. వేమన నీతి పద్య రత్నావళి (1,116 పద్యాలు), సి. వి. కృష్ణాబుక్‌డిపో, మదరాసు. 1961. (పునర్ముద్రణం)

14. ఆంధ్రకవి తరంగిణి, ఆరవభాగం: చాగంటి శేషయ్య, హిందూ గ్రంథశాస్త్ర గ్రంథనిలయం, కపిలేశ్వరపురం. 1961. (పునర్ముద్రణం)

15. సమగ్రాంధ్ర సాహిత్య, 12–వ సంపుటం: ఆరుద్ర. శేషాచలం కంపెనీ, మదరాసు. 1968.

తెలుగు – ఇంగ్లీషు

1. The Verses of Vemana (693 Verses): అనువాదకులు–సి పి. బ్రౌన్, వి. రామశాస్త్రులు & సన్స్, మదరాసు, 1911 (పునర్ముద్రణం)

2. Verses of Vemana (in the Telugu Original with Englisn rendering, 1,215 Verses) by C. P. Brown, ఏ. పి. సాహిత్యా అకాడెమీ, హైదరాబాదు, 1967.

3. The Musings of a Mystic by Mahmood Ali khan, Hyderabad, 1966.

## English

1. Hindu Manners, Customs and Ceremonies by J.A. Dubois, Oxford 1953 (Reprint).

2. "Vemana - A South Indian Poet" by William Howard Campbell, Madras Christian College, Magazine, 1898.

3. "Vemana" by R. M. Macdonald, Madras Journal of Literature and Science, 1866.

4. The Folk - Songs of Southern India by Charles E. Gover, Higginbotham & Co., Madras. 1871.

5. Some Milestones in Telugu Literature, Vol II : The Age of Vemana by G. R. Subramiah Pantulu, B. Narasimheswara Gupta, Madras. 1915.

6. Telugu Literature by P. T. Raju, P. E. N., Bombay. 1944.

7. Telugu Literature by P. Chenchaiah and Raja M. Bhujanga Rao, Calcutta (Undated)

8. "On Vemana" by C. R. Reddy, Radio Talk, A. I. R., Madras. 1950.

9. Saint Vemana : His Philosophy by Ishwara Topa, Hyderabad Telugu Academy, Hyderabad. 1950.

10. "Vemana : His Poetry and Philosophy" by G. V. Krishna Rao (Published in Halfway, the Golden Book presented to V. R. Narla on his Fifty First birthday) 1958.

11. The Heart of India by L. D. Barnett. London. 1924.

12. Vemana : The Telugu Poet and Saint by C. Ramakrishna Rao, G.A. Natesan & Co., Madras (Undated)

13. Vemana through Western Eyes, Compiled and Edited by V. R. Narla. M. Seshachalam & Co., Madras. 1969.

# కొన్ని పదాల సంగ్రహ వివరణ

**అద్వైత వేదాంతం** : ఏకేశ్వర సిద్ధాంతాన్ని ప్రతిపాదించే మతం. భారతదేశంలో దీన్ని మొట్ట మొదట రూపొందించినవాడు గౌడపాదుడు. శంకరాచార్యుడు దీని వ్యవస్థాపకుడు. ప్రచారకుడు.

**అనంతకృష్ణశర్మ రాళ్ళపల్లి** . ఆంధ్ర సాహిత్యాన్ని మథించిన విద్వాంసుడు. తెలుగు తమిళ, కన్నడ, సంస్కృత, పాలీ భాషలలో పండితుడు. సంగీత కళా ప్రపూర్ణుడు. వీరిది మత సామాజిక ఆచారాలలో సాంప్రదాయిక దృక్పథమైనా మత సహనం లేని వారు కారు. సూటిగా వాడిగా రచిస్తారు. ఆంధ్ర విశ్వకళా పరిషత్తులో వేమనను గురించి ఉపన్యసించారు. పాలీ భాషనుండి గాథాసప్తశతిని అనువదించారు. సరస విమర్శకులు. 1839వ సంవత్సరంలో జన్మించి, మైసూరు మహారాజా కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగ 1912 నుండి 1949 వరకు పని చేశారు.

**అభినవగుప్త** (సుమారు క్రీ. శ. 1000.) తత్త్వవేత్త. అలంకారశాస్త్రంలో ప్రామాణికుడు.

**అమరకోశము** : వింటర్‌నెట్జ్, యం. (M. Winternitz) ప్రకారం క్రీ. శ. 6–8. శతాబ్దుల మధ్యకాలంలో జీవించిన బౌద్ధమతస్థుడైన అమరసింహుడు సంతరించిన అతి ప్రఖ్యాతి కెక్కిన ప్రాచీన సంస్కృత నిఘంటువు. మూడు భాగాలుగా విభక్తమైన పర్యాయ పదాల నిఘంటువిది.

**అలంకారశాస్త్రాలు** : అలంకారాలను గురించిన శాస్త్రం. యం. వింటర్‌నెట్జ్ ఇలా పేర్కొన్నాడు, "అతి ప్రాచీన కాలం నుండి భారతదేశంలో అలంకారాలను ఒక శాస్త్రంగ రూపొందించారు." అలంకార శాస్త్రం ఎంతగా అభివృద్ధి చెందిందంటే కవులకది సహాయకారిగా ఉండడానికి బదులు నిర్బంధంగ తయారైనది.

**ఆంధ్ర సాహిత్య పరిషత్** : సాహిత్య పరిశోధన కొనసాగించే సంస్థ. ఆదిలో 1911వ సంవత్సరంలో మద్రాసులో ఇది స్థాపింపబడ్డా, ఆ తరువాత దీని

గ్రంథాలయం, కార్యాలయం కాకినాడకు మార్చబడ్డాయి. ఈసంస్థ పోషకుల్లో మిక్కిలి వితరణశీలుడు పిఠాపురం మహారాజా అయిన కీ. శే. శ్రీరావువేంకట కుమార మహీపతి సూర్యారావుగారు। ఈ గ్రంథాలయంలో సుమారు ఐదు వేల తాళపత్ర గ్రంథాలున్నాయి.

ఉపనిషత్తులు : ఇవి రెండు వందలకు మించిన తర్క గ్రంథాలు. ప్రమాణంలోను విషయస్థాయిలోను ఇవి పరస్పరం భేదిస్తవి. కొన్ని వచనంలోను, కొన్ని పద్యరూపంలోను వున్నాయి. వీటి రచనాకాలం బౌద్ధపూర్వ యుగం నుండి ఆధునిక కాలం వరకు కొనసాగుతుంది. అల్లోపనిషత్, కృష్ణోపనిషత్ అన్నవి కూడ వున్నాయి. సామాన్యాభిప్రాయానికి భిన్నంగా ఉపనిషత్తుల తత్త్వ మంటూ ఒక క్రమబద్ధమైన, సమానమైన సిద్ధాంతం ఏదీ లేదు. డా॥ సర్వేపల్లి రాధాకృష్ణగారిలా అన్నారు: "తాత్త్విక సత్యాన్ని చేరుకోవడం ఉపనిషత్తుల లక్ష్యం కాదు....వాటిలో పరస్పర విరుద్ధాలు, అశాస్త్రీయాలు అయిన విషయాలున్నాయి." ఏ. బి. కీత్ (A. B. Keith) ఇంకా వివరంగ చెప్పారు, "ఉపనిషత్తుల్లోని సిద్ధాంతాలు చారిత్రకంగ ఆసక్తిదాయకాలు. తాత్త్వికంగ అవి ఒక్క క్షణమైనా ఆలోచనార్హాలు కావు."

ఎర్రాప్రెగడ, ఎడపాటి : తెలుగు కవి. 16వ. శతాబ్ది ఉత్తరార్థంలో రచించి వుండ వచ్చు. ఈయన ఇంటి పేరు ఎడపాటి కాదు కాని పెదపాటి అని కొందరు పండితుల అభిప్రాయం. వాఙ్మయ చరిత్ర కారులకి ఆయన జన్మస్థలాన్ని గురించి ఏకాభిప్రాయంలేదు. మల్హణ చరిత్ర ఈ కవి రచించిన ప్రసిద్ధ గ్రంథం. విజయనగర సామ్రాజ్య ప్రభువైన శ్రీ కృష్ణదేవరాయలకీ గ్రంథాన్ని అంకిత మియ్యాలని ఆదిలో ఈ కవి సంకల్పించినా ఏ కారణాల చేతనో దీన్ని ఆ కాలంలో రాజకీయ దక్షత గల కలయమంత్రికి అంకిత మిచ్చాడు. కొందరు ఛందఃకర్తలు ఈ కవి కృతంగ పేర్కొన్న కుమార నైషధం అలభ్యం.

కందనోలు : కర్నూలుకు ప్రాచీన నామం.

కబీర్ : భారతదేశంలో మధ్య యుగాలకు చెందిన గొప్ప సిద్ధులలో ఒకడు. ఈతని కాలం వివాదాస్పదమైనది. ఇతని మరణ కాలాన్ని గురించి కూడ వాదోప వాదాలున్నాయి. ఈతడు 15వ. శతాబ్దపు వాడని అధిక సంఖ్యాకులు అంగీక

రిస్తున్నారు. ఈయన తల్లిదండ్రులను గూర్చి కూడ వివాదాలున్నాయి. ఇతని తల్లిదండ్రులు ముస్లిములైనా అయి వుండాలి. లేదా బ్రాహ్మణ విధవరాలు విడిచి పెట్టితే, మహమ్మదీయ దంపతులు పెంచి వుండాలి. వృత్తిచే సాలీడు. రామానందుని శిష్యుడుగ కబీరు స్వమత దురభిమానాన్ని ఖండించాడు. అల్లా లేక రాముడు అన్న నామాలతో నిమిత్తం లేకుండ పరమేశ్వరుని ఉపాసించమని ప్రబోధించాడు.

కురళ్ : తమిళులు వేదంగా పరిగణించే "కురళ్" తమిళ సాహిత్యంలో మహా కావ్యం. ఇందులో నీతులు ఉపదేశింపబడ్డాయి. ఇందులో మూడు ప్రకరణా లున్నాయి. మొదటి దానిలో నీతిని గురించి, రెండవ దానిలో సంపదను గురించి మూడవ దానిలో ప్రేమను గురించిన వివరణమున్నది. మొత్తం 1, 330 ద్విపదల కావ్యమిది. తిరువళ్ళువరు దీని కర్త.

గండికోట : కడప జిల్లాలో, ఒక శిథిల ప్రాకారం గల కుగ్రామం. వేమన అన్న గారికి కోటకు కొంత కాలం ప్రభువుగా వున్నట్లు జనశ్రుతి. దీనికి ఆధారాలు లేవు.

గ్రియర్సన్, సర్ జార్జి అబ్రహాం (1851–1941) : విద్యారంగంలో అనేక విశిష్ట తల్ని పొందిన విద్వాంసుడు. ఈయన 1873వ. సంవత్సరంలో ఇండియన్ సివిల్ సర్వీసులో ప్రవేశించి, 1903వ సంవత్సరం పదవీ విరమణం చేశాడు. హిందూస్థానీ, సంస్కృత భాషలతో సహా అనేక భారతీయ భాషల్లో నిష్ణాతు డైన ఈయన్ను భారతీయ భాషల పర్యవేక్షణ సంస్థలో సూపరింటెండెంటుగ నియమించారు. ఆ హోదాలో ఈయన భారతీయ భాషలకు అపారమైన, శాశ్వతమైన సేవను చేశాడు.

జ్ఞానదేవ్ (1275–1296) : మహారాష్ట్ర యోగివరేణ్యులలో ప్రప్రథముడు. అగ్ర గణ్యుడు. బహుగ్రంథకర్త. వానిలో భగవద్గీత వ్యాఖ్యానమైన "జ్ఞానేశ్వరి" చాలాప్రసిద్ధ గ్రంథం.

చైతన్య (1486–1533) : బెంగాలు భక్తులలో ప్రఖ్యాతుడు. తన జీవితం, ప్రబో ధాల ద్వారా బెంగాలు, ఒరిస్సా, అస్సాం రాష్ట్రాలలోని కవులు అద్భుతమైన భక్తి గేయాల్ని రచించేలా ప్రేరేపించాడు. భార్య భర్తకు తన్ను సంపూ

ర్ధంగ సమర్పించుకునేలాగ భక్తుడు భగవంతునికి సంపూర్ణ సమర్పణ చేసుకో వాలన్నది ఈయన ఉపదేశాల్లోని ముఖ్యాంశం. భారత దేశమంతటా చైతన్య మతానికి లక్షలాది అనుయాయులున్నారు.

జోన్స్, సర్. విలియం (Jones, Sir William, 1745-94): మేధావియైన బ్రిటీషు న్యాయవేత్త. 1783 - వ సంవత్సరం కలకత్తా సుప్రీంకోర్టులో జడ్జిగ నియమితుడయ్యాడు. ఉద్యోగంలో ప్రవేశించిన మరు సంవత్సరమే, బెంగాల్ ఏషియాటిక్ సొసైటీని స్థాపించటంలో ముఖ్యపాత్రను వహించాడు. ఐరోపియను ఏషియను భాషలనేకం తెలిసినవాడు గనుక భాషల తులనాత్మక పరిశోధనాశాస్త్రాన్ని ప్రారంభించాడు. "హిందూ - ముస్లిం లా" అన్న గ్రంథమేకాక కాళిదాసు నాటకాల్లో ఒకదాన్ని అనువదించాడు. బహుముఖ ప్రజ్ఞావంతుడైన యీయన భాషాశాస్త్ర దురదృష్టం కొద్ది పిన్నవయస్సులోనే మరణించాడు.

టాగోర్, రబీంద్రనాథ్ (1861-1941): భారతీయ కవుల్లో భవభూతి, కాళిదాసుల తరువాత పేర్కొనదగిన మహాకవి 1913. వ. సంవత్సరంలో నోబుల్ బహుమతి గ్రహీత.

తిరువళ్ళువర్: జైనుడైనా కాకపోయినా "కురళ్" రచించిన కవి కడమ జాతివాడు. మనకు తెలిసిన ఆయన పేరుకు (వాస్తవానికదది ఆయన అసలుపేరుకాదు) అర్థం "వళ్ళువర్ కులానికి చెందిన యోగి" అని మాత్రమే. వళ్ళువర్ కులస్థులు అగ్రవర్ణానికి చెందరు. ఈ కవికాలం తెలియదు. క్రీ. పూ. 1. వ. శతాబ్దంనుండి, క్రీ. శ. 3. వ శతాబ్దం వరకు, ఒక్కొక్క పరిశోధకుడు ఒక్కొక్క శతాబ్దంగ ఆయన కాలాన్ని నిర్ణయించారు.

తుకారాం (1598-1649) మహారాష్ట్రకు చెందిన భక్తకవి. ఒక చిన్న అంగడి పెట్టుకొని జీవనం కొనసాగించిన పేదవాడు. అయినప్పటి మహారాష్ట్ర రాజైన శివాజీ పంపిన బహుమతుల్ని స్వీకరింప నిరాకరించాడు. పెక్కు కీర్తనల్ని రచించాడు, 4,600 అభంగాలకు (కీర్తనలకు) కర్త.

దండి: అలంకార శాస్త్రరచయిత. ఈయన కాలాన్ని గురించి తీవ్రమైన వాదాలున్నాయి.. బహుశా 7. వ. శతాబ్ది ఉత్తరార్థంలో జీవించివుండవచ్చు.

అలంకారాల్ని గురించి ఆయన వ్రాసిన కావ్యాదర్శంకన్న, శృంగారాత్మక గద్యకావ్యమైన దశకుమార చరిత్ర బహుళ ప్రచారమున్న గ్రంథం.

దాదు (1554–1603): కవి భక్తాగ్రేసరుడు. ఇతనిపేర ఒకమతం స్థాపింప బడింది. జన్మస్థలం అహమ్మదాబాదయినా రాజస్థాన్‌లోనే ఈయన అధిక కాలం నివసించాడు. కొందరీయనను బ్రాహ్మణుడంటారు. మరికొంద రీయన్ను బ్రాహ్మణేతరుడంటారు. ఈయన వృత్తి పత్తిని శుద్ధీకరించడం.

దుబాయ్, జె. బి.: దక్షిణ భారతదేశంలో క్రైస్తవ మిషనరీగ ఇంచుమించు 31 సంవత్సరాలు పనిచేసిన ఒక ఫ్రెంచి మతాచార్యుడు (1770. వ. సంవత్సరం ప్రాంతంలో జన్మించివుంటాడు). భారతదేశంలో తానున్న ప్రాంతపు ఆచారాల్ని, వస్త్రధారణని అనుసరించి సామాన్యుల మధ్య, వారిలో ఒకడుగ జీవించిన వ్యక్తి. Hindu Manners, Customs and Ceremonies అన్న ఆయన గ్రంథం 1792–1823 మధ్యకాలంలోని హిందూ సమాజపు యదార్థ చిత్రాన్ని ప్రతిబింబిస్తుంది.

నామదేవ్ (1270–1350): ఇతడు మహారాష్ట్రీయుడు. వృత్తిచే దర్జీ. ఈయన కవి, భక్తుడు. పంజాబ్‌లో ఒక దశాబ్దం నివసించాడు సిక్కుల మత గ్రంథమైన "గ్రంథ్ సాహెబ్"లో ఈ కవి సంకీర్తనలు కొన్ని ఉన్నాయి

నాగార్జునుడు: బౌద్ధమత దార్శనికుడు. మానవాళికి చెందిన తత్త్వవేత్తలలో మహనీయుడని Professor Th. Stcher atsky of the Academy of Sciences, U. S. S. R. అభిప్రాయం. క్రీ.శ. 1. వ. శతాబ్దంలోనే బౌద్ధతత్త్వంలో మాధ్యమిక సిద్ధాంతాన్ని పెంపొందించాడు. ఇప్పుడు నాగార్జునకొండగ ప్రసిద్ధికెక్కిన ఆంధ్రరాష్ట్రంలోని శ్రీ పర్వతంలో ఇతడు తన చరమదశను గడిపాడు.

నానక్ (1469–1538): సిక్కుమత స్థాపకుడు. సిక్కుల పదిమంది గురువులలో ప్రథముడు. ఇప్పటి పశ్చిమ పాకిస్తాన్‌లో వున్న "తల్వండి" గ్రామంలో జన్మించిన ఈ మహనీయుడు విశ్వమానవ సౌభ్రాతృత్వాన్ని, ప్రేమని ప్రబోధిస్తూ దేశమంతటా సంచరించాడు.

పాషండుడు: నాస్తికుడు, వేదాల ప్రామాణ్యాన్ని అంగీకరింపనివాడు.

**పోప్, డా॥ జి. యు** : తమిళభాషలో గొప్ప పాండిత్యాన్ని సంపాదించిన క్రైస్తవ మిషనరీ. 1886. వ. సంవత్సరం లండన్ పట్టణంనుండి తాను అనువదించిన "కురళ్" గ్రంథాన్ని ప్రకటించాడు. ఆ తరువాత "తిరువాసకమ్" అనే మరొక తమిళకావ్యాన్ని కూడ అనువదించాడు.

**బసవడు**: మానవుల్ని విడదీసే వర్ణ, వర్గవిభేదాల్ని, సమస్త కృత్రిమ అడ్డులమీద తిరుగుబాటు చేసే విప్లవ మతోద్యమమైన వీరశైవ మతస్థాపకుడు. మైసూరు రాష్ట్రంలో బగెవాది అనే ఊరిలో ఒక బ్రాహ్మణ కుటుంబంలో 12 వ శతాబ్ది పూర్వార్ధంలో జన్మించిన బసవడు భారతదేశంలోని మత సాంఘిక సంస్కర్తల్లో గొప్పవాడుగ ప్రసిద్ధి కెక్కాడు.

**బ్రహ్మసూత్రాలు**: తాత్త్విక సూత్రాల గ్రంథం. దీని కర్తృత్వం వ్యాసునికి అంటగట్టబడినా, డా॥ యస్. యన్. దశ గుప్తగారి ప్రకారం ఇది అతి ప్రాచీన గ్రంథం కాదు. "ఈ సూత్రాలలో ఇంచుమించు ప్రతి భారతీయ తాత్త్విక సిద్ధాంతం ప్రస్తావింపబడడంచేత ఇవి అతి ప్రాచీనకాలంలో వ్రాయబడివుండవు" అన్నది వారి అభిప్రాయం. క్రీ. పూ. 2. వ.శతాబ్దంలో ఇవి రచింపబడి వుండవచ్చునన్నది ఆయన మతం. జాకొబి (Jacobi) అన్న అతను అవి ఇంకా తరువాతి కాలంలో రచింపబడివుంటవని భావిస్తున్నాడు. ఆయన అవి క్రీ. శ. 200–450 మధ్యకాలానికి చెందినవిగ చెప్పుతున్నాడు. ఈ సూత్ర వ్యాఖ్యాతలలో ప్రసిద్ధులు శంకరాచార్యులు, రామానుజులు, మధ్వుడు. డా॥ రాధాకృష్ణన్ ఆధునిక వ్యాఖ్యాత. కొన్ని వ్యాఖ్యానాలకు వ్యాఖ్యలు కూడ ఉన్నాయి.

**బ్రౌన్, చార్లెస్ ఫిలిప్ (1798-1884)**: మదరాసు సివిల్‌సర్వీస్ ఉద్యోగి. తెలుగు ప్రజల్ని, తెలుగు భాషాసాహిత్యాల్ని బ్రౌన్ అత్యంతం ప్రేమించాడు. వారికి ఎనలేని స్వచ్ఛందసేవను చేశాడు. తెలుగు వ్యాకరణాన్ని, తెలుగు–ఇంగ్లీషు, ఇంగ్లీషు–తెలుగు నిఘంటువుల్ని సంతరించి ప్రచురించడమే కాకుండ, వందలాది తాళపత్ర ప్రతుల్ని సేకరించాడు. ప్రాచీన కావ్యాల ప్రతుల్ని సేకరించి, సవరించి, శుద్ధప్రతుల్ని తయారుచేసి ప్రకటించడానికి ప్రాంతీయ పండితుల్ని ప్రోత్సహించాడు. తన అకుంఠిత పరిశ్రమవలన క్షేమన సాహిత్య యశస్సుకు పునాదులు వేశాడు.

మల్లికార్జున పండితుడు: కాకతీయ సామ్రాట్టయిన ద్వితీయ ప్రోలయ సమకాలికుడు. (1116-58 A.D) మల్లికార్జునుడు మహాపండితుడు. ప్రజలను ఆకట్టుకునే వక్త. తన వాక్చాతుర్యంతో సమకాలిక బౌద్ధుల్ని బహిరంగ వాదాలలో ఓడించాడు. ఈయన శివతత్త్వసారం సాహిత్యపరంగ ఉత్తమగ్రంథమే కాక శైవసిద్ధాంతపరమైన సద్గ్రంథం.

ముకర్జీ ధూర్జటి ప్రసాద్ (1394-1961): అంతర్జాతీయ ఖ్యాతిగల ప్రసిద్ధ సోషలిస్టు. లక్నో విశ్వవిద్యాలయంతో ఈయనకు సన్నిహిత సంబంధమున్నది. సునిశిత మేధ, సృజనాత్మకత, అరుదైన సామాజిక స్పృహ కలవాడు. వంగ, ఆంగ్ల ఉభయభాషల్లో చక్కని రచనలు చేశాడు.

మూగ చింతపల్లె : వేమన జన్మస్థలమని చెప్పబడే పల్లె. ఇదే పేరు గల గ్రామాలు రెండు నెల్లూరు జిల్లాలో, గుంటూరు, కడప, చిత్తూరు జిల్లాలలో ఒక్కొక్కటి వున్నాయి. వీనిలో ఏది వేమన జన్మస్థలమన్నది పరిశోధకులు ఇంకా తేల్చని వివాదాంశం.

రామకవి, తురగా : రామకవి పండితుడు; విద్వాంసుడు. కోపం వస్తే తిట్టుకవి, 16వ. శతాబ్దపు ఉత్తరార్థంలో జీవించాడు.

రామస్వామి, కావలి. వేంకట (1765-1840) : కావలి సోదరులలో ఒకడు. ఇంగ్లీషు భాషలో రచనలు చేసిన ఆదిమ రచయితలకు చెందిన వాడు. కలకత్తాలోని Literary and Antiquarian Department లో రామస్వామిగారు ప్రధాన అనువాదకులుగ, పండితులుగ వుండేవారు. సంస్కృతంలో వేంకటాచారి రచించిన విశ్వగుణాదర్శానువాదమే వారి ప్రథమ రచన. 1825లో ముద్రితం. Biographical Sketches of Deccan Poets అన్నది వారి స్వతంత్ర ద్వితీయ రచన. 1829లో ప్రచురితం ఆ కాలంలో ఆయన ప్రముఖుడుగ వుండి వుండాలి. ఎందుచేతనంటే ఆయన తన గ్రంథద్వయాన్ని కలకత్తా సుప్రీంకోర్టు జడ్జి అయిన సర్. ఎఫ్. డబ్ల్యు. మ్యాక్‌నాటన్ (Sir F. W. Macnaughten) కు గవర్నర్ జనరల్ అయిన విలియం బెంటింగ్ ప్రభువునకు అంకితమిచ్చాడు.

రామానంద : రామానందుడు 1400–1470 మధ్య కాలంలో జీవించి వుండాడన్నది ఎఫ్. ఇ. కే. (F. E. Keay) గారి అభిప్రాయం వారే ఇలా పేర్కొన్నారు "ఆత్మ స్వరూపి, అవ్యక్తుడైన ఏకేశ్వరుడనే విశ్వసించాలని విస్పష్టంగ ప్రబోధించాడు. ఆ ఏకేశ్వరుడే రాముడని చెప్పాడు. అయినా ప్రాచీన పురాణాల్ని గాని, హిందూ విగ్రహారాధననుగాని నిరసించలేదు." రామానంద వ్యక్తిత్వం ఎంత ఆకర్షణీయమైనదంటే ఆయన శిష్యవర్గంలో "ఒక శూద్రుడు, ఒక జాట్, ఒక అస్పృశ్యుడు, వుండటమే కాక, మహమ్మదీయ సాలీడు(కబీరు) ఒక స్త్రీ కూడా వున్నారు."

రాయ్‌దాస్ : వృత్తి చెప్పులు కుట్టడమే అయినా, రాయ్‌దాస్ 15వ. శతాబ్దంలో అధికంగ గౌరవింపబడిన భక్తశిఖామణి. కవి. చిటోర్ యువరాజైన జాలీ ఇతని శిష్యగణంలో ఒకడు.

లాల్‌దాస్ : కబీరు ఉపదేశాలతో ప్రబోధితుడై లాల్‌దాస్ "లాల్‌దాసీస్" అనే మతాన్ని స్థాపించాడు. ఇతని జన్మస్థలం ఆల్వార్, "మియోల్" అనే ఆటవిక జాతికి చెందినవారు. ఇతని జనన కాలం తెలియదు. క్రీ. శ. 1648వ. సంవత్సరంలో మరణించాడు

వేంకటరత్నం, సర్ రఘుపతి (1862–1939) : గొప్ప విద్యావేత్త, సంఘ సంస్కర్త, ఆచార్యుడు, వీరేశలింగం సమకాలికుడే గాని, వయస్సులో పంతులుగారి కన్న చిన్నవాడు. సమాజంలోని అట్టడుగున వున్నవారి, అస్పృశ్యుల, దేవదాసీల సముద్ధరణకు ప్రత్యేకంగ పాటుపడ్డాడు. మదరాసు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుల స్థాయికి ఎదిగాడు.

సర్కార్, బినాయ్‌కుమార్ (1887–1949) : వంగ భాషలోను, ఆంగ్లంలోను ప్రశస్తమైన అనేక గ్రంథాల్ని రచించిన బహుముఖ ప్రజ్ఞావంతుడు, ఆర్థిక సామాజిక రంగాలలో అంతర్జాతీయ ప్రఖ్యాతిని గడించిన వ్యక్తి. ఈయన గ్రంథాలు అనేక భాషల్లోనికి అనువదింపబడ్డాయి. అనేక దేశాల నుండి విద్యాపరమైన, తదితర సన్మాన, సత్కారాల్ని పొందాడు.

సర్వజ్ఞుడు : ఈయన నిజనామధేయం "పుష్పజ్ఞుడు." ఒక శూద్ర విధవరాలికి బ్రాహ్మణునికి పుట్టిన బిడ్డ. ఈయన ఉపదేశాలు కూడా ఇంచు మించు వేమన ప్రబో

ధాటీకి సమానంగా వుంటాయి. సర్వజ్ఞుని కాలం క్రీ. శ. 1600 అని ఇ. పి. రైస్ (E. P. Rice) అంచనా. కాని ఎవ్వరూ నిర్దుష్టంగా సర్వజ్ఞుని కాలాన్ని చెప్పలేకపోతున్నారు.

స్మిత్ విన్సెంట్. ఏ, (Smith, Vincent 1848–1920): భారతీయ సాంస్కృతిక చారిత్రక రంగాలలో ఇంచుమించు అర్ధశతాబ్దం పరిశ్రమించిన భారతీయ ప్రభుత్వోద్యోగి. ఆయన చేసిన అనేక రచనల్లో అశోకుని జీవిత చరిత్ర, The Early History of India(1904) History of Art in India and Ceylon అన్న మూడు గ్రంథాలు తరువాతివారికి మార్గదర్శకాలు. 1918 లో ప్రచురితమైన The Oxford History of India అన్నది తుది రచన.

హేమచంద్రుడు (1088–1172 A. D.): బహు విద్యావిశారదుడైన జైన పండితుడు, కవి చరిత్రకారుడు, సంస్కృతంలోను, ప్రాకృతంలోను అలంకార శాస్త్రాన్ని గురించి ఇంక అనేక విషయాలను గురించి రచించిన బహుగ్రంథకర్త.

---